


ఎడిటర్ పందిరి మల్లికార్జునరావు

అసిస్టెంట్ ఎడిటర్ పందిరి మీరాబాయి

సంపుటము: ౬ | నవంబరు 1953 | సంచిక 11

# భాషారాష్ట్రాలు

అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆత్మార్పణం మూలంగా ఆంధ్రులకు రాష్ట్రం సిద్ధించింది. వారి ఆత్మబలిదానంవల్ల ఆంధ్ర రాష్ట్రసిద్ధే కాకుండా, కేంద్ర ప్రభుత్వ దృక్పథంలో సంపూర్ణంగా మార్పున్నూ కలిగింది. భాషాప్రయుక్త రాష్ట్రవిభజనకూ, ముఖ్యంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికీ ప్రతికూలంగా ఉంటూవచ్చిన ప్రధాని నెహ్రూగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సుముఖులై రాష్ట్ర నిర్మాణాన్ని తథ్యం చేశారు. అప్పటినుంచీ, భాషాప్రయుక్త రాష్ట్రాలపట్ల తమకున్న తీవ్ర ప్రాతికూల్యాన్ని శ్రీ నెహ్రూగారు సడలించుకొన్నారు. ఆంధ్రరాష్ట్రసిద్ధికై ప్రధానంగా కారణభూతులైన శ్రీ పొట్టి శ్రీరాములుగారికీ, రాష్ట్రనిర్మాణానికి అనువైన కార్యకలాపాన్ని అమలుపరచిన ప్రధాని నెహ్రూకీ ఆంధ్రులు కృతజ్ఞులై ఉండగలరు. ఆంధ్రులేకాదు—భాషారాష్ట్ర వాదులందరూకూడా వారిని అభినందిస్తారు.

భారతదేశం సమగ్రంగానూ, సంపూర్ణంగానూ ప్రజాస్వామికంగా వికాసాన్ని పొందాలన్నా, ప్రజానీకం సాంస్కృతికంగా ముందంజ వేసి భారత జాతీయైక్యతకు దోహదం కలిగించాలన్నా భాషాప్రయుక్త రాజ్యాలు అవసరమనే విషయం అంగీకరించవలసి ఉంటుంది. దేశాన్ని ముక్కలు ముక్కలుగా చేసి భారత జాతీయతకు భంగం కలిగించడం భాషాధార రాష్ట్రవాదుల అభిప్రాయం ఎంత మాత్రం కాదు. అసంబద్ధమైనట్టివీ, పరిపాలనాసౌలభ్యానికి అనుకూలంగా లేనట్టివీ దేశవిభజన మారవలసి ఉంటుందనీ, జాతీయ వికాసానికి తోడ్పడగల భాషాప్రయుక్త రాష్ట్ర విభజన అత్యంత అవసరమనీ భాషాధారకవాదులు చెప్తున్న విషయం. ఏమైతేనేమి—నేటికి కేంద్రప్రభుత్వ వైఖరిలో మార్పు కలిగింది. భాషారాష్ట్ర సూత్రంపై రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు కేంద్రం సమ్మతిస్తున్నది. అయితే, తొందరపాటు కూడదని హెచ్చరిస్తూ ఉన్నది.

ఈ విషయమై విచారణ చేయడానికి కేంద్రప్రభుత్వం త్వరలోనే ఒక ఉన్నతాధికార సంఘాన్ని నియమించనున్నదనీ, రేపో మాపో ప్రభుత్వ ప్రకటన వెలువడగలదనీ

హోం శాఖామంత్రి శ్రీ కట్జూ ఇటీవల బొంబాయిలో ఒక ప్రసంగంలో అన్నారు. అయితే ఈ సంఘం ఏర్పడి తన నివేదికను సిద్ధపరచడానికి ఒక సంవత్సరం పట్టవచ్చు. ఈ నివేదిక కేంద్రప్రభుత్వానికి చేరినతరువాత దాని ఆధారంగా ఒక సరిహద్దు నిర్ణాయక సంఘాన్ని కేంద్రం నియమించవలసి ఉంటుంది. ఈ కార్యక్రమం అంతా పూర్తి కావడానికి కొంతకాలం పట్టవచ్చు. అంతవరకూ భాషా రాష్ట్రవాదుల ఆందోళన విరమింపబడుతుందని ఆశించడం కష్టం.

కన్నడిగులు మహారాష్ట్రులు తమ తమ ప్రత్యేక రాష్ట్రాలకై చేస్తున్న ఆందోళన నానాటికీ తీవ్రతరమౌతూ ఉద్యమం బలంపోసుకుంటూ ఉన్నది. ఈ ఉద్యమం ఒత్తిడి తీవ్రతర కార్యాచరణకు ప్రేరకం కావచ్చు.

మహారాష్ట్రులు బొంబాయి నగరానికి పట్టుపట్టిపోయినచో బొంబాయి రాష్ట్రంలోని మరాఠీ ప్రాంతాలతోను మధ్యరాష్ట్రంలోని మహారాష్ట్ర ప్రాంతాలతోను బృహన్మహారాష్ట్రం సులభంగా ఏర్పడడానికి ఆటంకం ఉండజాలదు.

మద్రాసు బొంబాయి రాష్ట్రాలలోని కర్ణాట ప్రాంతాలతో మైసూరు విలీకరణం కావడానికి మైసూరు రాజప్రముఖ్ అంగీకరిస్తే కర్ణాటకరాష్ట్ర సమస్యకూడ పరిష్కారం కావడానికి ఎక్కువ వీలుగా ఉంటుంది.

కాబట్టి ఈ కార్యక్రమం నెరవేరాలి అంటే— కేంద్రం ఉన్నతాధికార సంఘాన్ని వెంటనే ఏర్పాటుచేయవలసి ఉంటుంది. శ్రీ కట్జూ అభిభాషణ ప్రకారం ఈ సంఘం ఏర్పాటులో విలంబనం ఉండదని ఆశించవచ్చు. ఈ కమిషను నివేదిక ప్రాతిపదికగా సరిహద్దు నిర్ణాయక సంఘంకూడా ఏర్పడడానికి ఎట్టి అవరోధం ఉండదనికూడా తలచవచ్చు.

ఈ సంఘం ఏర్పడినప్పుడు మన కర్తవ్యం ఏమిటి? ఆంధ్ర ప్రభుత్వం బాధ్యత ఎలాగు నిర్వహించవలసి ఉంటుందనే విషయాన్ని ఇప్పటినుంచే ఆలోచించవలసి ఉంటుంది. దీనికి చేయవలసిన సన్నాహాలూ వేయవలసిన పథకాలూ ఆంధ్ర ప్రభుత్వం యోచించవలసి ఉంటుంది. ప్రజలు ప్రభుత్వానికి తోడ్పడాలి. కేంద్రప్రభుత్వం ఏర్పాటు చేయగల ఈ సంఘాల యెదుట పెట్టవలసిన విషయాల సేకరణకు సరియైన ఏర్పాట్లు వెంటవెంటనే జరుగవలసి ఉంటుంది.

తమిళ కర్ణాటక రాష్ట్రాలలోని ఆంధ్ర ప్రాంతాలూ ఓఢ్రదేశంలో కలుపబడిన బరంపురం పర్లాకిమిడి, జయపురం మొదలైన ప్రదేశాలూ మధ్యరాష్ట్రంలోని తెలుగు ప్రాంతాలు ఆంధ్ర రాష్ట్రంలో చేరాలి. కాబట్టి ఆంధ్ర ప్రభుత్వం దీనికై తగు శ్రద్ధవహించి మన వాదాన్ని బలపరచి మన ప్రాంతాలను ఆంధ్రరాష్ట్రంలో చేర్పడానికి కృషిచేయవలసి ఉంటుంది.

పార్టీ రాజకీయాలతో సతమతమవుతున్న రాజధాని సమస్యా తదితర చిల్లర సమస్యలూ ఆంధ్రప్రభుత్వ అధినేతలయొక్క ఆంధ్ర రాజకీయ నాయకులయొక్క దృష్టిని ఆకర్షిస్తున్నవి. అంతేగాని మన రాష్ట్రసౌభాగ్యానికి ఆర్థిక సామాజిక పారిశ్రామికాది రంగాలలో చేయవలసిన అభివృద్ధి మన ప్రభుత్వం ఏమీ పట్టించుకోవడంలేదు. ఈ విషమదృక్పథంనుంచి బయటపడి, సమగ్ర రాష్ట్రకల్యాణానికి దోహదకరమైన పథకాలను పంథాలను ఆంధ్ర ప్రభుత్వం, ఆంధ్ర నాయకులు యోచించవలసినదిగా మా విన్నపం. స్వలాభాలకై స్వప్రయోజనాలకై మన నాయకులు దేశాన్ని బలిపెట్టరని ఆశించవచ్చునా?

—•••—

కోని, తమస్ఫూర్తి కొక పూర్వం రచించినవి కనక, అవి కాలం
సుడిగుండాలు తప్పించుకోలేకపోయి వుంటాయి

అలా పోటులుపడిపోగా, రత్నాలే మనకి మిగిలాయి

ఎప్పు డయినా గట్టిగించలే మిగులుతాయి కాని పొల్లుకున్నా
పని తప్పనిదే

కనక, గ్రంథం తయారు అందా అచ్చువడవలసిందే
యెప్పుడు.

దానివల్ల యుక్తర్లకు ప్రయోజనం కలిగినా కలక్క-పోయినా,
తన గ్రంథం అచ్చువడటంవల్ల మరో గ్రంథం రచించాలన్న
ప్రేరణ కలుగుతుంది, కవికి

కవి అయినవాడికి, ప్రాణాంతంకంటేమా విలవ అయినది,
యీ ప్రేరణ.

కవి అయినవాడికి, నిద్రాహారాలకంటేమా యెక్కువ అవ
శ్యక మయినది యీ ప్రేరణ

ఈ ప్రేరణ దీక్షపుట్టిస్తుంది, కవికి
ఈప్రేరణ అదీక్షకు ఏకాగ్రత సంపాదిస్తుంది
దాంతో రాతకు కూచుంటాడు కవి. తాదాత్మ్యంతో
రాయగా రాయగా భాష స్వాధీనం అవుతుంది
రాయగా రాయగా,రచనావిధానం సుపరిష్కృతం అవుతుంది
రాయగా రాయగా క్రాంతదర్శిత్వ నిశితం అవుతుంది
రాయగా రాయగా తపస్సిద్ధి కలిగి మహర్షి అవుతాడు కవి
"నానృషిః కురుతే కావ్యమ్"
మహర్షి కానివాడు కావ్యం రచించలేడు
మహర్షి కానివాడు రచించినది కావ్యమూ కాదు
మరి, వొక్క రోజులో మహర్షి అయిపోదామా యెవడయినా?
సోపానక్రమంగా యత్నంతో సాధన కావాలి, దానికి

అచ్చుప్రతి అయినా రాతప్రతి అయినా గ్రంథం నలుగురి
చేతుల్లోకూ పడటం ఆసోపానాలలో ఒకటి

అలాగ, వొకటి తరవాత వొకటిగా యెన్నో సోపానా
లెక్కితేగాని తక్కర్తకు తన భంగపాటేదో తెలియదు

తనకే సాధ్యం—సాధించుకోవలసిం దేమిటో అవగాహన
కాదు.

అది తెలిస్తేగాని అడుగు ముందుకి పడదు
పడితే తప్ప సిద్ధి యెక్కడిది?

తన గ్రంథం తానే అచ్చువేయించుకోవలసివస్తే మాత్రం
ప్రేరణ, దర్పణమూ, సిద్ధి దుర్లభమూ అయిపోతాయి కవికి

ఈ సందర్భంలో కొందరి విషయమై అపవాద (మినహా
యింపు) ఉండకపోదు కాదు; కాని, మెజారిటీ కవులకు దౌర్భాగ్యం

ఏమంటే?

తన గ్రంథం తానే అచ్చువేయించుకుంటే పెట్టిన డబ్బు
తిరిగి రాబట్టుకోడమూ తన సంసారం నిర్వహించుకోడానికీ,
మరో గ్రంథం అచ్చువేయించుకోడానికి తగినంత లాభం లాగ
డమూ—అలాంటి దోరణిలో పడిపోతాడు కవి

దానివల్ల అతని కవితాతపస్సు భంగపడిపోతుంది
కవికి కాదు తెలుసుకోగలిగితే జాతికే తీరని నష్టం అది

అయితే, కవి అయినవా డల్లా దరిద్రు డయి వుండాలని కాదు,
చెప్పడం

కవి అయినవా డల్లా ధనికు డయి వుండకూడ దనిన్నీ కాదు,
చెప్పడం

ధనికత్వమూ నిర్ధనికత్వమూ లోకసామాన్యాలు
మరి, కవి?
లోకాతీతుడు
కనక,—

ధనసంపాదన మాత్రం కవికి ధ్యేయం కాగూడదు

కవికే కాదు, ధనసంపాదన యేకైకాపేక్షకూ ధ్యేయం
కాగూడదు

విశ్రాంతగా—చిన్న యెత్తున అయినా అతనికి కాలక్షేపం
జరిగిపోవాలి —అంతే

సంపత్స్వపరమూన్నాకే అక్కర్లేదు డాబుదీర్లలో కాల
క్షేపం చేసిన్నీ ఉద్గ్రంథాలు రచించగలడు కవి

దారిద్ర్యమూ ఐశ్వర్యమూ కూడా ప్రేరకాలూ కాలేవు,
భంజకాలూ కాలేవు కవిత్వానికి

టాగూరు, జమీందారు కనకనే—సాంసారికాలైన వడిదుడుకు
లెరగనివాడు కాబట్టే అలాంటి ఉద్గ్రంథాలు రచించగలిగా డనీ,
నోబిలు బహుమానమూన్నూ గడించుకున్నా డనీ అనుకుంటారు,
అనుకర్త.

కవితాసమాధిలో కూచున్నాడా—వరి అయిన తాదాత్మ్యం
సిద్ధించిందా ఇక అతనికి భోగాలమీదికి దృష్టిపోదు కష్టాలూ
కనపడవు

పీరవం వచ్చి చెయ్యి ముడుచుకుపోగూడదు పేగులు మాడి
దృష్టి చెదిరిపోగూడదు—ఈ ప్రతిబంధకాలు కలక్కుండా వుంత
దానికే కవికి ఆహారం

ధనికు డైనవాడి కయినా కవితావేశం కలిగినప్పు డిదే
ప్రవృత్తి

నర్సులో (బహుమితంగానే) డబ్బుండినా దృష్టి రచనా
వ్యగ్రమై కదలలేక, కూరలకోసం బజారుకి వెళ్ళాలన్న స్ఫురణే

కలక్క "పూరగాయ లేమి విలవలేవు మరో" అంటూ వంటింటో నుంచి కేక వినవచ్చినా ప్రక్కింటో పడలేక—వేళకి మాత్రం పీట మిదికి వెళ్ళి—అప్పటికి పూరుగాయతోనూ చారుమజ్జిగలతోనూ భోజనం అయిందనిపించుకుని చెయ్యి అరడం తడువుగా మళ్ళీ కలంపట్టి—దాంతో ప్రపంచం మరచిపోయిన దినాలెన్నో వున్నాయి నా జీవితంలో

ఏదో" రాయకుండా వుండలేని స్థితే యిలా వుంటే పద్యబంధం చేసినా వచనరచనే చేసినా మహాకవులే అయి వుండిన వారి స్థితి యెలా వుండనూ

తెలుసుకోగలిగితే యీ భౌతికదేహం విలువకోగలగడానికి ఎలానా మాత్రమే ఉపయోగపడుతుం దన్న నిర్ధారణ లేదు

మహోజ్వలవేషంతో ఏదిలోకి వస్తారు కవి ఒకొక్కప్పుడు
ఎంత దాబురా అనుకుంటారు అల్పబుద్ధులు
చింకిపాతలతో కనపడతారు కవి మరొక్కొక్కప్పుడు
హో—టి దరిద్రుడు అనుకుంటుంది మాయలోకం
ఎరిలిస్తే అభావనా యీ పోషణా కూడా అవివేకజన్యాలే
ఏమంటే
అతను మహర్షి అనడానికి నిదర్శనం అది
బిల్లాంగనతో మన్మథతంత్రంలో మునిగిపోయి వుండిన వాల్మీకి శ్రీమద్రామాయణం రచించగలిగాడు

గాధారణ్యాలలో తపోనిష్ఠ దయివుండిన కృష్ణద్వైపాయనుడే మహాభారత యుద్ధంలో ప్రముఖపాత్ర కాగలిగాడు

అంటే అంతటి మహాకవుల యీ అవస్థ జనసామాన్యం బోధపరుచుకోనూలేదు అనుసరించాలేదు

ఆయన దరిద్రుడే కాని సకలసంపదలకూ కారణం వల్లకాటిలోనే తిరుగుతూ వుంటాడు కాని త్రిలోకాలకూ నాథుడాయన భయంకరంగా కనబడతాడు కాని సౌమ్యరూపి అనే చెప్పాలి అంటూ నిర్వచించి మహేశ్వరుని యాథార్థ్యం తెలిసిన వారు లేరు అంది పార్వతి

కవి యాథార్థ్యమూ అలాంటిదే మహామహా వ్యాఖ్యాతలు గూడా నిర్ధారణ చెయ్యలేకుండా వున్నారది

మనిషి యెంత నిర్లిప్తుడు కావచ్చునో అంతా నిర్లిప్తుడూ కాగలడు ఎంత లిప్తుడు కావచ్చునో అంతా లిప్తుడూ కాగలడు కవి

ఇచ్ఛామాత్రా లాదళ లతనికి
అతని చూపుమాత్రం యేదశలోనూ వాక్కుటే
అది యేకాగ్రం



అదే క్రాంతదర్శిత

కనకనే ఆకాశపథాలలో విహరించే భాగ్యశ్రీమంతుల భోగభాగ్యావస్థలూ వర్ణించగలడు ఎలుక కలుగుల వంటి గుడిసెల్లో నివసించే కటికదరిద్రుల యమయాతనలూ చిత్రించగలడు కవి యథాతథంగా

దుఃఖం వచ్చినా ఆనందం వచ్చినా దేనిపేరికి దృష్టిపోదు మనిషికి

రకంలో భిన్నమే గాని రాశిలో అలాంటి మనోధర్మమే కవిదిన్నీ

అయితే జీవయాత్రలో భంగపాటు కలుగ్గానే ప్రపంచం మునిగిపోయినట్లు గోలపెట్టేస్తాడు మామూలు మనిషి

కాయికంగా మాత్రమే బాధపడుతూ—ఆ స్థితిలో కూడా మానసికంగా నిర్వికల్ప దయిపోతాడు కవి

అతని తాదాత్మ్యకతకు నిదర్శనం అది
రసలోలత అలాంటి సిద్ధి కలిగిస్తుం దతనికి
రసో వై సః
నిజమే కాని రసనిష్ఠ రసికునకూ కలుగుతుంది మరి కవి విశేషం యేమిటి
అంటారా
ఒక్క మాటలో చెప్పాలంటే రసికుని రసనిష్ఠ యేకదేశం
రసిక దైనవాడికి కవి రచనలో వొకప్పు డొక వాక్యంతో లేదా వొక పద్యంతో బుద్ధి చమత్కృతం అవుతుంది
హృదయం స్పందిస్తుంది
రసానుభూతి కలుగుతుంది దాంతో
మరి మరొకప్పుడు
మరి తక్కిన వాక్యాల—లేక పద్యాలమాట

ఏ రసికుడూ కూడా "ఈ కావ్యంలో యిక్కడే రసం—యింతే వుంది" అంటూ నిర్ధారణ చెయ్యలేడు పరిమితి కట్టలేడు

కాళిదాసు రచనల కెందరో వ్యాఖ్యానాలు చేశారు
ఎందరో ఎన్నో పారవశ్యాలు తీశారు
పూర్తి చెయ్యగలిగారా

ఇంకా యింకా యెందరో కొత్త అందాలు చూపించ గలుగుతున్నారేం?

అయినా యింకా యింకా యేదో నిగూఢంగా వుండిపోయి వస్తే అనిపిస్తోం దేం

కవికీ రసికునకూ వుండే అంతరం అదిగో అది

కే స్నే క

రసికుని వత్తా సాత్వికం.
కవి వత్తా నిరవధికం
అంతేకాదు —
అది లౌకికం
ఇది ఆధ్యాత్మికం

అఖండగోదావరిలో జలపానం చేసే యిత్రదీమది కవి రచనలో రసం ఆస్వాదించే రసికునిదీ వాక్కు-టే అంతస్థు

ఏమంటే ?
రసికుడు రసపిపాసి
కవి రసస్రష్ట

కాని ధనలోభం పుట్టిందా కవికి ఈ రసవిష్ట యెగిరి పోతుంది

అది దౌర్బల్యమూ యిది పతనమూను కవికి

" ఇలాంటిది తటస్థించకుండా వుండా లంటే రసికులైన వారు కవిని కనిపెట్టుకుని వుండాలి సర్వకాలసర్వావస్థల్లోనూ

కవికి తన గ్రంథా లచ్చువేయించుకోవలసిన దౌర్భాగ్యం పట్టకుండా జాగ్రత్తపడాలి

అది చాలదు
కవిని అందలా లెక్కించాలి
కవికి కనకాభిషేకం చెయ్యాలి

ఇంతా చేస్తే కవి కిది పత్రం పుష్పం ఫలం తోయ ముమ్నా మాత్రమే

రసికులకు స్తోత్రం పరాకాష్ఠ ఇది

ఈ బాధ్యత అంతా యిప్పుడు జనులమీద పడింది మునుపు రాజులు మోయుచునేవారు

"ఈ రాజాశ్రయం అప్పుడు కవుల స్వమద్దర్శనశక్తి భంగ పరచలేదా ?" అంటే ఇలా అడిగే చిత్తవృత్తి వుండిందా అప్పటి జనులకు ?

ఇలాంటి చిత్తవృత్తి యిప్పుడుంది గదా మరి జనులు కవుల నారాధిస్తున్నారా మన తెనుగుదేశంలో ?

అరోజులే వస్తుం ఏ రాజో యే మంత్రో యే దండనాథుడో యే రాజబంధువో అవని తివ్వయ్య వంటి యే రాజవణిక్కో కవు లెవరైనా వత్తా నమస్కరించి ద్రవ్యమో మాన్యమో వృత్తో అగ్ర హారమో యిచ్చి ఆదరించే వారు కవిని
కవికి కాలం గడిచిపోయేది

రాజాస్థానంలోనో దేశాటనం చేస్తూ రసికుల సన్నిధినో తన రచన చదివి వినిపించి తన విశిష్టత ప్రకటించుకునేవారు కవి

గ్రంథం మంచి దన్నమాట పుట్టిందా యెంత దూర మైనా నడిచివెళ్లి వచ్చినవాళ్ళతో అత్తినరు పెతుకులు తింటూ దానికి ప్రతులు రాయుకునేవారు రసికులు అన్ని పనులూ విడిచి

ఈవిధంగా కవికి ఉత్సాహం రేకెత్తుతూ వుండేది
వెనకటి అలాంటి రసికులే నిలావుతుంటూ వచ్చారు ఉద్గ్రంథాలు తక్కర్తలు కారు

ఆ గ్రంథాలు చదివి ఆనందముగ్ధులూ అయేవారు వారు
ఎరి యిప్పుడు ?

ప్రజాపత్తాకం వచ్చింది జనులకు నిరంకుశప్రభుత్వపిశాచం వొదిలిపోయింది

అచ్చు వచ్చింది రసికులకు ప్రతులు రాయుకోవలసిన కష్టమూ తొలగిపోయింది

మరి కవికి ?
ఈ రెండింటివల్లా కవి ఎవి మాత్రం అస్తవ్యస్తం అయి పోయింది

ఏవాక్కు-వ్యక్తికీ కవిని పోషించే శక్తిలే దిప్పుడు

అధికారంతోపాటు కవుల నారాధించవలసిన బాధ్యతా మీద ఎడిందన్న జ్ఞానం లేదు మన ప్రజాస్వామ్య ప్రభుత్వానికి

పోనీ అంటే నా చిన్నప్పటికే కా దిప్పటికీ తగిన ప్రతి ఫలం యిచ్చి రాసిరైటు కొనుక్కునే ప్రచురణకర్తలు బయలుదేర లేదు మన తెనుగుగడ్డమీద

ఇది ప్రచురణకర్తల తప్పుకాదు మన తెనుగువారి వాఙ్మయ ప్రీతి అలా వుంది మరి
కవి సంగతి అలా వుండగా —

కవి కిచ్చిన క్రయధనమూ అచ్చువనులకు ప్రకటనకార్యాలకూ పెట్టిన పెట్టుబడీ వచ్చి కాను లక్షణంగా తినడానికి మోటార్ల మీద తిరగడానికి తగినంత ప్రతిఫలం రావాలి ప్రచురణకర్తకు

వచ్చిన లాభం కాస్తా వడ్డీ మింగెయ్యకుండా వెంటవెంటనే పుస్తకా లమ్ముడుపోవాలి ఎలాంటి ఉద్గ్రంథా లయినా అచ్చు వేయించడానికి ప్రచురణకర్త సిద్ధపడా లంటే

మరి ఇలాంటి పరిస్థితులు కల్పిస్తున్నారా మనవాళ్లు ?
ఉన్నలోటల్లా యిది
మరో పెద్దలోటు మనకు నాయకులు లేకపోవడం

రాజ్యాలకు రాజు లెంత అగత్యమో ప్రజానత్రాణాలకు నాయకు లంత అగత్యం

నాయకులు పరంపరగా వెలుస్తూ, యెప్పటికప్పుడు సరి అయిన దారిలో పెడుతూ వుంటేగాని ఏ జాతీ నిలకడగా వొక అంతస్థులో వుండదు ఎన్నడూ

ఏ జాతికి నాయకుడు లేడో ఆ జాతివారు, చదవవలసినవి చదవరు చూడవలసినవి చూడరు చెయ్యవలసినవి చెయ్యరు మానవలసినవి మానరు, తమవారు చెబితే లక్ష్యపెట్టరు, పైవారు చెబితే దాపోహం అనకమానరు

కష్టం తక్కెడకూ ఆ జాతికే మాత్రమే పోలిక
అచ్చంగా యిప్పటికీ మన జాతికి స్థితి యిదీ
కనకనే మన కన్నీ లోట్లే, అన్నీ లొసుగులే
కాగా —

మన కవులకు ఎవరి గ్రంథం వారే అచ్చువేయించుకోడం తప్పనిసరి అయిపోతోంది

నోటు రాస్తే యెవరో నొకరు అప్పిచ్చేవారు దొరక్కపోరు

డబ్బు చేతిలో పోస్తే పుస్తకం అచ్చువేసి యిచ్చే ముద్రాపకులూ లేకపోలేదు

మరి అచ్చుపని ముగిశాక ?

అచ్చు వెయ్యడం యెందుకో అది అచ్చువేశాకే ప్రారంభం అవుతుంది

దానిపేరు వ్యాపారం
దాని పరణి వేరు
దాని క్కావలసిన ప్రవృత్తిన్నీ వేరు
అది కవులకు దూరం
అంటరానిదిన్నీ

కాని తన గ్రంథం కానే అచ్చువేయించుకునే కవి అది అలవడుచుకోక తప్పదు

నిజమే . గాని సరిగా నడవదు, అది కవికి.
ప్రతిభ లేక కాదు, ప్రకృతి కాక
అంచేత పెట్టిన డబ్బు తిరిగి రాదు
రాదంటే రాకాపోదు, మళ్లీ
కాస్తకాస్త వస్తుంది, అది పుణ్యకాలం కాస్తా పోయా వుంటుంది యెప్పటికప్పుడు

ఇక అప్పులవారు మిగులుతారు

అప్పులవారికీ వొక దారే, ఎవరిది వారు వసూలు చేసుకోవడం ధర్మమే కనక

అప్పుల బాధ అలా వుండగా, గ్రంథాలయాలవారు కొందరూ పరిచితులు కొందరూ గ్రంథకర్తలమీద పడతారు

గ్రంథా లూరికే యిమ్మంటారు
పోస్టేజీ భరించిన్నీ పంపమంటారు, కొందరు

దానా దీనా దృష్టిచెదిరిపోయి మరో గ్రంథం రాయడం అసాధ్యం అవుతుంది, కవికి

కవీనం దుర్బలం అయినా అయిపోతుంది, రోజులు.

తెలుసుకోగలిగితే జాతికే చుట్టుకుంటుంది యీ దౌర్భాగ్యం, అటు తిరిగి యిటు తిరిగి

ఇలా కాక.—

ఏదో విధంగా తన గ్రంథం అచ్చుకాకపోయినా కవికి నిరుత్సాహమే

అదీ అతను మరో గ్రంథం రాయలేకపోడానికి కారణమే, చాలా సందర్భాలలో

కాని యెంత చెబితే మాత్రం మనవారికి సత్యం అవగాహన అవుతుందీ ?

[శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి అముద్రిత "అనుభవాలూ, జ్ఞాపకాలూ" రెండోభాగం నుంచి ]

—(౦)—

## రచయితలకు మనవి

"కిన్నెర"లో గద్యవ్యాసాలు మాత్రమే ప్రకటింపబడగలవు పద్యాలు, గేయాలు "కిన్నెర"లో ప్రకటింపబడజాలవు కావున, రచయితలు పద్యాలు, గేయాలు మొదలగునవి పంపవద్దని మనవి

—ఎడిటర్

# నాటకము - రసానుభూతి

భూపతి లక్ష్మీనారాయణ రావు

(ఆగస్టు సంచిక తరువాయి)

రసాస్వాదన యనునది మనస్సునకు సంబంధించిన విషయ మనియు దానికి భావనావ్యాపారము ప్రధానముగా నాశ్రయ మగు చున్నదనియు నిదివరలో వివరింపబడినది సామాజికునియందు రసోత్పత్తి యెట్లు కలుగుచున్నదనెడి విషయమునుగూర్చి చర్చించుటకు పూర్వము మానవమన స్తత్త్వమును గూర్చియు చిత్తవృత్తులగు భావముల స్వభావమును గూర్చియు నీ రెంటికిని గల పరస్పర సంబంధమును గూర్చియు కొంత విమర్శ యవసరమగుచున్నది కారణరూపమగు నాలంబన విభావము నాధారమున భావము మనస్సు నందుద్బుద్ధమై ఉద్దీపన విభావాదులచే వికసించి స్థాయిగా నేర్పడు చున్నది అట్లు మనస్సున నెలకొన్న స్థాయిభావ ప్రాబల్యమున చిత్తము పరిపరివిధములగు నలజడికి లోనగుచున్నది సంచారి భావోత్పత్తికి ఈ యలజడియే సన్నిహితమగు హేతువు ప్రత్యక్షము, ప్రబలము నగు విభావము ఆలంబనము కాకుండుటవల్లను చిత్తము ఇదివరకే సారవంతమగు నొక భావముచే నాక్రాంతమై యుండుటవల్లను ఈ సంచారులు తాత్కాలికముగ మాత్రమే ప్రవర్తించును మరియు చిత్తము నాక్రమించియున్న స్థాయీభావమే యీ తాత్కాలిక భావపరంపరల యుత్పత్తికి సన్నిహితాలంబన మగుటచే దానిని త్రోసిరాజనుటకు వీనికి శక్తియును లేదు కావున సంచారులగువానికి రసముగ పర్యవసించు నధికారము లేదు స్థాయి భావము మాత్రమేకాక ప్రత్యక్షమగు సన్నివేశమో విషయమో ఆధారముగా నిట్టి తాత్కాలిక భావములు మనసున పొడమవచ్చును వీని యుత్పత్తి కాధారమగు నా విభావ మల్పమైనదియై యుండుటయే యీ భావములు తాత్కాలికము లగుటకు కారణము కావున అల్పవిభావముల వలన నుత్పన్నములైన భావములు సంచారులుగ మాత్రమే ప్రవర్తింపగలుగుచున్నవి ఆలంబనము ప్రకృష్టము సమర్థము నైయున్నప్పుడే మనస్సు నందుద్బుద్ధమైన భావము మనస్సు నాక్రమించి స్థిరపడి దానిపై నధికారమును వహింపగలుగు చున్నది అట్టిభావమే స్థాయి యగుచున్నది ప్రశాంతముగనున్న కొలనునీటిలో బరువగు వస్తువు పడుటతో నొక పెద్దయల యుత్పన్నమై నలువైపుల ప్రసరించుటయు నా యల యితరములగు చిన్నచిన్న యలల యుత్పత్తికి కారణమగుటయు ప్రకృతిసిద్ధమగు విషయము స్థాయిసంచారి భావముల విషయమున నిది స్థూలమగు భౌతికదృష్టాంత మగుచున్నది తరంగోత్పత్తికి కారణభూతమగు వస్తువుయొక్క భారమును పరిమాణమును వేగమును ననుసరించి తరంగమున కున్నతియు శక్తియు సిద్ధించునట్లే విభావముయొక్క ప్రకర్షము ననుసరించి భావము స్థాయియో సంచారియో అగుచున్నది స్వల్పమగు శక్తియు తాత్కాలిక ప్రవృత్తియు మాత్రమే కల సంచారికి రసపర్యవసాయియగు సామర్థ్యము లేదు మానవ మన స్తత్త్వమున కీ విషయముతో సమన్వయము చక్కగ కుదురు చున్నది జీవితమున నేర్పడు సంఘటనలన్నియు మనస్సు నలజడి నొందింపజాలవు అల్పవిషయము లన్నిటికిని మనస్సుపై నట్టి ప్రాబల్యమే యున్నచో జీవితము నడచుటయే దుర్ఘటము కాగలదు జీవితమున మన కయిష్టములగు నల్పవిషయములు జరుగుటయు తత్క్షణముగా మనస్సున ఖేదమో కోపమో విసుగో తాత్కాలికముగ నేర్పడుటయు సహజమే ఈ ఖేదాది చిత్తవృత్తులు తాత్కాలిక ప్రవృత్తిని కల్గి మరునిమిషముననే లయించిపోవుచున్నవి చిత్త మన్యభావమున కాకరమగుచున్నది భయత్రాసముల కును క్రోధరోషములకును గల భేద మివిషయమును సువ్యక్తము చేయగలదు

> "వ్యాఘ్రదర్శనాదిజన్మా పరమానర్థ విషయకో
> వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః భయం"

అను లక్షణమును బట్టి పరమార్థవిషయకమగు వైక్లబ్యము భయమని తెలియుచున్నది ఇందు వ్యాఘ్రాదులవలన వ్యక్తికి మరణాది రూపమగు భావము కలుగుచున్నది

> "స్త్రీనీచప్రకృతికం గురురాజాపరాధశ్వాపదశూన్యాగారాటవీ
> పర్వతగహన గజాదిదర్శన నిర్భర్త్సనకాంతర దుర్దిన
> నిశాంధకారోలూక నక్తంచరారావ శ్రవణాదులు

భయమునకు కారణములగును (విభావములు) కరచరణ హృదయ కంపనములు ముఖశోషణ జిహ్వాపరిలేహన స్వేద వేపథు సంభ్రాంతాదులు (కార్యములుగను) అనుభావములుగను నాట్యశాస్త్రమున పేర్కొనబడినవి రౌద్రమూర్తియై తమ్మాక్రమింపవచ్చు భీముని గని, ఉపకీచకులు

"ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెల్లొక్కొ యంచున్ భయం బొదవం బల్లములందు దాఁగియు నమీపోర్వీజముల్ ప్రాఁకియుం,

బెదరం బాఱియు పీరు సొచ్చియును విశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియుగా, భరితసంక్షోభాత్ములై రత్తరిన్ "

ఈవర్ణన భయమునకు చక్కనిలక్ష్యము ప్రళయకాలాంతక మూర్తి యగు భీముని రాక ఉపకీచకులకు ప్రాణాంతమగు మహానర్థమైనది కావున ప్రాణభీతిచే వారు సంక్షోభాత్ములై ప్రవర్తించినారు అనుభావరూపమగు వారిప్రవర్తనచే చిత్తప్రవృత్తి చక్కగ వ్యక్తమగుచున్నది ఇందు విభావము ప్రకృష్టమైనది యగుటచే చిత్తమునకు గలిగిన అలజడియు తత్ఫలమగు అనుభావరూప బాహ్యప్రవృత్తియు కూడ ప్రకృష్టములే యై యున్నవి కావున భయమనెడి చిత్తవృత్తికి స్థాయిత్వార్హత కలిగినది ఇక త్రాస విషయము వేరు "ఆకస్మికభయా చ్చిత్తవిక్షోభ స్త్రాసః" అనియు విద్యుదుల్కాశనిపాత నిర్ఘాతాంబుధర మహాసత్త్వ పశురవాదుల వలన గలుగు చిత్తవృత్తివిశేషము త్రాసమనియు

"ఘీరో ర్ఘోరసత్త్వదర్శన స్ఫూర్జథు
శ్రవణాది జన్మా చిత్తవృత్తివిశేష స్త్రాసః"

అనియు లక్షణములు ఇందు పేర్కొన్న విభావములు సామాన్యములగుటచే హృదయమునం దేర్పడిన భావము కూడ స్వల్పమైనదియే యగుచున్నది మరణాదిరూపమగు మహానర్థశంక యిందేమాత్రమును లేదు సెలగోల పట్టి తన్ను దండించుటకై వచ్చు యశోదను చూచి కృష్ణుడు పరుగిడుచు

" స్తంభాదికంబుల తనకు నడ్డంబైన విట్టటునని పట్టపీనివాని
పీతవస్త్రపైరింపు మింక దొంగిలంబోవ వేనని మునుముట్టి
నేడ్చువానిం,
గాటుక నెఱయంగ గన్నుల మలముచు వెడలు కన్నీటితో
వెగచువాని
నేడెన వచ్చెన్నోయిది యని పలుమాఱు సుసుగుచుం గ్రేగంటం
జూచువాని"

యను వర్ణన త్రాసమునకు లక్ష్యమగుచున్నది కృష్ణున కిందు కలిగిన భీతికి కారణము సామాన్యమైనదియే కాని మహానర్థకారి కాదు ప్రాణాపాయశంక యిందేమాత్రమును లేదు కావున చిత్తమునకు కలిగిన యలజడి కూడ స్వల్పమైనదియే రసగంగాధర లక్ష్య మీవిషయమునే బాగుగ వ్యక్తమొనర్చుచున్నది

మాకురు కశాం కరాబ్జే కరుణావతి కంపతే మమ స్వాంతం
ఖేలన్నజాతు గోష్ఠే రంబ విలంబం కరిష్యామి"

అని కృష్ణుని పల్కు కావున హఠాత్తుగా గలిగిన యీ చిత్త విక్షోభము శీఘ్రమే అణగునదే కాని, హృదయమున కావేగమును కలిగించునదికాదు. కావున త్రాసము సంచారి యగుచున్నది అట్లే నాట్యశాస్త్రమున

ఆధర్షణాక్రుష్టకలహవివాదప్రతికూలాదులు క్రోధమునకు విభావములగును. వికృష్టనాసాపుట ఉద్వృత్తనయన సందష్టోష్ఠపుట గండస్ఫురణాదులు అనుభావాదులగను వివరింపబడియున్నవి

"గురుబంధువధాది పరమాపరాధజన్మా
ప్రజ్వలనాఖ్యః చిత్తవృత్తివిశేషః క్రోధః"

అను రసగంగాధరలక్షణమునందలి "పరమాపరాధజన్మా" "ప్రజ్వలనాఖ్యః" అను ప్రయోగములు క్రోధస్వభావమును బాగుగ వ్యక్తము చేయుచున్నవి చిత్తమును ప్రజ్వలింపచేసెడు పరమాపరాధ మిందు విభావము అపరాధినాశముతో గాని చిత్తమునకు స్తిమిత మేర్పడదు కావుననే "అయం చ పరవినాశాదిహేతుః" అనియు వివరింపబడియున్నది దుశ్శాసన కీచకకృత ద్రౌపదీవిషయక మహాపరాధము భీముని చిత్తమును ప్రజ్వలింపజేసినది తదపరాధులు నశించువరకును భీముని చిత్తము క్రోధభావాక్రాంతమై యుండక తప్పదు అట్లే ఉపకీచకకృత ద్రౌపదీవిషయక పరిభవముచే చిత్తము ప్రజ్వలింపగా భీముడు

"వికటభ్రూకుటిఘోరఫాలకలితస్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుండుం భ్రమర్దపదకావిర్భావసంభావితాం
గకుండుం జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండునై "

కుంభమూర్తివిస్ఫూర్తితో విజృంభించి మాటయేవు రుపకీచకులను సమయించి శమితక్రోధుండైనాడు కనుక నీ చిత్తవృత్తి స్థాయి యగుచున్నది ద్రౌపదిహృదయము కూడ నిట్లే దుశ్శాసనవధాంతము వరకును క్రోధమునకు నిలయమై యున్నది

"నెట్టన నిట్టియల్క మదినిల్పితి రక్కసకాల్మిం జిచ్చొదిం
గట్టినయట్లు పెద్దయునుగాలము '
"ఈవెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి దొలుతగాం
దోరిలో దున్నపేను
తను వింతలింతలు దునియలై చెదరి రూపఱియున్నం గని
యాదుకొంటగాక
యలుపాలం బొనువడునట్టి చిచ్చే యిది '

ఇత్యాది ద్రౌపదీవాక్యము లిందనుసందేయములు ఇక, అమర్షమనెడి (రోష) సంచారిభావముయొక్క లక్షణమును పరికింతము

"విద్యైశ్వర్యబలాధికై రధిక్షిప్తస్య
అవమానితస్యవా సముత్పద్యతే"

యని, విద్యాశౌర్యాదులం దధికులైనవారిచే జరిగిన అవమానాదుల ఉత్సాహులగువారియందు రోషమునకు కారణములుగా నాట్యశాస్త్రమున పేర్కొనబడియున్నవి శిరఃప్రకంపన స్వేదాదులు అధోముఖ విచింతనాదులు మున్నగునవి యిం దనుభావములు

"పరకృతావజ్ఞాది నానాపరాధజన్యః మౌనవాక్పాది పారుష్యాది కారణీభూత శ్చిత్తవృత్తివిశేషోఽమర్షః"

అను రసగంగాధర లక్షణమునుబట్టి స్వల్పకారణోత్పన్నమైన కోపలేశము అమర్షమనియు, నది తాత్కాలికమనియు వ్యక్తమగుచున్నది అపరాధులగువారి విషయమున మౌనమువహించుట లేక పరుషవాక్కులను బల్కుట యిత్యాదులవలన నిది గమ్యమానమగుచున్నది

"తీవ్రాపరాధజన్మాతు పరుషవచన అసంభాషణాది
హేతుః అయమేవ అమర్షాఖ్యో వ్యభిచారీతి వివేకః"

అను వివరణ మీవిషయమును వ్యక్తమొనర్చుచున్నది

"ఇంతుల నేచుపాతక మదింతట నంతటఁ బోదు పాంథలో
కాంతక నిమ్న ఘోరతమమై ఘనమై యజహత్కళంకమై
వంతలఁ బెట్టి యాఱునది వ్రక్కలు సేయక పూర్వపక్షపుం
గంతులకేమి చూచెదవుగా తుది నీ బహుళార్తిభేదముల్‌"

అను గిరికాకృత చంద్రదూషణ మిందు లక్ష్యమగుచున్నది ఇట్లు భయత్రాసముల విషయమునను, క్రోధరోషముల విషయమునను నొసంగిన లక్ష్యములు స్థాయిసంచారులకు గల భేదమును సువ్యక్తమొనర్చుచున్నవి

కారణములగు విభావాదుల యోగ్యత ననుసరించి హృదయమున గలుగు భావము స్థాయిగనో సంచారిగనో ప్రవర్తిల్లుననుట గమనింపదగిన విషయము

"భావశబ్దేన తావ చ్చిత్తవృత్తివిశేషా ఏవ వివక్షితాః ।
తేషాంతు యోగ్యతావశా ద్యథాయోగం స్థాయిసంచారి
విభావానురూపతా సంభవతి॥"

అను వివరణ మీ విషయమునం దనుసంధేయము అదికాక

"స్థాయినో వ్యభిచారితా భవతి న తు వ్యభిచారిణాం స్థాయితా ।
ఏవం హి సతి తదాస్వాదే రసాంతరమపి స్యాత్॥"

స్థాయీభావము లాయా సందర్భములందు సంచారులుగా ప్రవర్తిల్లగలవు గాని, సంచారులకు స్థాయిత్వార్హత లేదనియు పైవాక్యము తెలుపుచున్నది మనసునాక్రమించియున్న స్థాయిభావకారణముగా నుత్పన్నమైన సంచారిభావమునకు కూడ స్థాయిత్వమే సిద్ధించుచో ఆస్వాదనసందర్భమున రసాంతరమునకు గూడ నవకాశ మేర్పడగలదు అది ప్రకృతికి విరుద్ధమగు విషయము రతిభావము క్రమముగా పరిపుష్టమై శృంగారముగా ఆస్వాద్యమగు పరిస్థితిలో తత్పోషణయందు సహకరించిన హాసమునకు గాని కరుణకు గాని ప్రవర్తియుండదు బాహ్యేంద్రియప్రవృత్తి యడగుట, చిత్తము రసోన్ముఖముగ పరిణతిజెందిన రతిభావముతో తాదాత్మ్యమును బొందుట జరిగినప్పుడే శృంగారరసాస్వాదన కవకాశమున్నది అట్టిచో మరియొకభావము చిత్తము నాక్రమించుట జరుగజాలదు కావున, స్థాయిభావ పోషకములగు సంచారులకు స్థాయిత్వార్హత లేదు

మరియు సందర్భమును బట్టి యొక సంచారిభావము మరియొక సంచారిభావముయొక్క యుత్పత్తికి కారణము కావచ్చును. అప్పు డట్లుత్పన్నమైన రెండవ సంచారిభావము మొదటిదానికి సంచారి యగుచున్నది

"వ్యభిచారిణా మపి చ వ్యభిచారిణో భవంతి ।
యథా నిర్వేదస్య చింతా, శ్రమస్య నిర్వేద ఇత్యాది॥

అని నిర్వేదమునకు చింతయు శ్రమమునకు నిర్వేదమును సంచారులగునని వివరణము అతిశయదుఃఖేర్ష్యాదులవలన కలిగిన విషయద్వేష మనెడి చిత్తవృత్తి నిర్వేదము రోదన దీర్ఘశ్వాస దీనముఖాదులు అనుభావములుగా నిర్వేదము వ్యక్తమగును

"యది లక్ష్మణ సా మృగేక్షణా న మదీక్షాసరణిం సమేష్యతి
అమునా జడజీవితేన మే జగతా వా విఫలేన కిం ఫలమ్‌"

అని రసగంగాధరలక్ష్యము సీతావియోగము కారణముగా రాముని కలిగిన శోకము నిర్వేదమునకు హేతువైనది ఈ నిర్వేదము చింతకు మాత్రమే కాక వితర్కమునకు కూడ కారణము కాగలదు చింతకు పూర్వమునను పిమ్మటను కూడ వితర్కమనెడి సంచారిభావమునకు ప్రవృత్తి కలుగునని

"వితర్కోఽస్యాః ఖలే పూర్వే పాశ్చాత్యే చోపజాయతే"

అను వాక్యమున వివరింపబడినది ఇట్లు స్థాయిభావప్రాబల్యము కారణమున నుత్పన్నములైన సంచారులు కూడ నితర సంచారిభావముల యుత్పత్తికి కారణములు కావచ్చును

"యత్రాపి వ్యభిచారిణి వ్యభిచార్యంతరం సంభావ్యతే,
తద్యథా పురూరవస్య ఉన్మాదేఽపి తర్కచింతాది
తత్రాపి రతిస్థాయిభావస్యైవ వ్యభిచార్యంతరం యోగః
న కేవల మమాత్యస్థానీయేనోన్మాదేన కృతోపరాగః ॥

అని అభినవగుప్తుడు విక్రమోర్వశీయ చతుర్థాంకమందలి పురూరవుని చిత్తస్థితి యుదాహరణముగా నీవిషయమును వివరించియున్నారు విప్రలంభము ననుభవించుచున్న పురూరవు డున్మాద

మనెడి సంచారిభావమునకు లోనై యున్నను తర్కచింతాదులు కూడ నాస్థితియందు ప్రవృత్తమగుచున్నవి అందును రతిభావమే స్థాయియనియు, ఉన్మాద మనూత్యస్థానమును మాత్రమే వహించి దాని ఉత్కర్ష నాపాదించుచున్నదనియు వ్యక్తీకరించియున్నారు సంచారులగు నీతర్కచింతాదులు స్థాయియగు రతిభావమునకు పోషకములగునేకాని ఉన్మాదమునకు కాదు, అని "తత్రాపి రతిభావస్యైవ వ్యభిచార్యంతరం యోగః" అను వాక్యమున వ్యక్త పరచియున్నాడు కావున స్థాయిభావాక్రాంతమైయున్న మనస్సున, తద్భావప్రాబల్యముచే భావపరంపర లొకదానివెంబడి యొకటిగాగాని, యొకప్పు డేకకాలమున గాని యుత్పన్నము కావచ్చును సంచారి భావము లెన్ని కలిగినను స్థాయికిగల ప్రాధాన్యమున కేమాత్రమును భంగము కలుగజాలదు రసముగా పర్యవసించు సామర్థ్యము స్థాయికి మాత్రమే కలదనియు సంచారులకు లేదనియు నాట్య శాస్త్రమున లౌకికదృష్టాంతముచే వివరింపబడియున్నది

> "యథా హి సమానలక్షణా స్తుల్యపాణిపాదోదర శరీరాః
> సమానాంగప్రత్యంగాః అపి పురుషాః కులశీలవిద్యాకర్మ
> శిల్పవిచక్షణత్వా ద్రాజత్వ మాప్నువంతి తత్రైవ చాన్యే-
> ల్పబుద్ధయ స్తేషా మేవానుచరా భవన్తి, తథా విభావాను
> భావవ్యభిచారిణః స్థాయిభావా నుపాశ్రితా భవన్తి ।
> బహ్వాశ్రయత్వా త్స్వామిభూతాః స్థాయినోభావాః
> తద్వత్ స్థానీయపురుషగుణభూతా అన్యేభావాః తా-
> ఉపాశ్రయన్తే ,

పురుషులు సమానలక్షణములు సమానాంగప్రత్యంగములు కలవారే యైనను వారిలో కులశీలవిద్యాదులందు విశిష్టులైనవారు మాత్రమే ప్రభువులగుటయు ఇతరులు పరిజనులగుటయు లోకప్రసిద్ధమగు విషయము అట్లే విభావానుభావవ్యభిచారులు స్థాయిభావము నాశ్ర యించి వర్తించును విభావానుభావ వ్యభిచారి పరివృతమైన స్థాయీ భావము రసమని వ్యవహృతమగుచున్నది ఈవిధమున ప్రకృష్ట విభావము కారణముగా సముద్బుద్ధమై అనుభావాదులచే వికసించి స్థాయిగా నేర్పడిన భావమనెడి చిత్తవృత్తి సంచారులనెడి యితర చిత్తవృత్తుల యుత్పత్తికి కూడ కారణమగుచున్నది మానవస్వభా వము ననుసరించి అట్లుత్పన్నములగు చిత్తవృత్తులు అసంఖ్యాకము లనియే చెప్పవలెను ఐనను, వానిలో ప్రధానములు సువ్యక్తములు నైనవానిని మాత్రమే గ్రహించి వానిసంఖ్య నలుబదితొమ్మిది యని అలంకారికులు వివరించినారు

> తత్రాష్టౌభావాః స్థాయినః త్రయస్త్రింశ ద్వ్యభిచారిణః
> అష్టౌ సాత్త్వికా ఇతి త్రిభేదాః ఏవ మేతే కావ్యరసాభి
> వ్యక్తిహేతవ ఏకోనపంచాశద్భావాః ప్రత్యవగంతవ్యాః
> ఏభ్యశ్చ సామాన్యగుణయోగేన రసా నిష్పద్యంతే

స్థాయిభావము లెనిమిదియు, సంచారులు ముప్పదిమూడును, సాత్త్వికము లెనిమిదియు చేరి నలుబదితొమ్మిది ఇవియే కావ్య రసాభివ్యక్తిహేతువులనియు వీనిమండియే సామాన్యగుణయోగ మున రసములు నిష్పన్నములగుననియు నాట్యశాస్త్రము వివరించు చున్నది కాని వీనిలో సాత్త్వికములు అయత్నజములుగ దేహ మునందు గలుగు కార్యములే యగుటచే నివి చిత్తవృత్తులు కావు

> "సత్త్వం నామ మనఃప్రభవమ్ మనసః సమాధౌ
> సత్త్వనిష్పత్తి ర్భవతి తస్య చయోఽసౌ స్వభావో
> రోమాంచాశ్రువైవర్ణ్యాది లక్షణో యథాభావోపగతః
> స న శక్యో అన్యమనసా కర్తు మితి "

భావముపై మనస్సు కేంద్రీకరించియుండు సమయమున (భావ సమాధిలో) మనస్సుమండి సత్త్వము నిష్పన్న మగుననియు రోమాంచాశ్రువైవర్ణ్యాది తల్లక్షణములు భావస్వభావముననుసరించి పైకి వ్యక్తములగుననియు తెలియుచున్నది దీనినిబట్టి రోమాంచా దులు సత్త్వప్రదర్శకములగు కార్యములే కాని చిత్తవృత్తులు కాజాలవని వ్యక్తమగుచున్నది కావున, సాత్త్వికములగు నీనిని పరిహరింపగా మిగిలిన స్థాయిసంచారులు నలుబదియొకటి మాత్రమే చిత్తవృత్తులగుచున్నవి శాంతమునకు స్థాయిభావముగా కొందరు పేర్కొన్న శమముయొక్క స్థితియే వివాహగ్రస్తము కనుక అది చిత్తవృత్తియా యను ప్రశ్నకూడ అనిశ్చితమే మరి కొందరు మాత్సర్య, ఉద్వేగ, సంశయ ఈర్ష్యాదులు కూడ చిత్త వృత్తులే యనియు, ఇవికూడ సంచారులలో చేరుననియు తెలిపి నారు కాని యివి భరతాదులు పేర్కొన్న ముప్పదిమూడు సంచారి భావములలోనే యంతర్భావమును బొందుచున్నవి మాత్సర్య మసూయయందును, ఉద్వేగము త్రాసమునను, ఈర్ష్య రోషము నను, సంశయము వితర్కమునను చేరిపోవుచున్నవి ఇట్లే స్థాయి భావయోగముచే అసంఖ్యాకములుగ హృదయమునం దుత్పన్నము లగు భావాంతరములన్నియు ముప్పదిమూడు సంచారులలో గాని, యితరములగు స్థాయిభావములలో గాని చేరిపోవుచున్నవి కావున భరతాదుల ననుసరించి స్థాయిసంచారులని వ్యవహృతములగు చిత్త వృత్తులసంఖ్య నలుబదియొక్కటి యని నిర్ణయము ఐనను, భర తాదులు భావములని పేర్కొన్న సంచారులన్నియు చిత్తవృత్తులేనా యను ప్రశ్నకు అవకాశమును లేకపోలేదు భరతాదు లొసంగిన లక్షణలక్ష్యములను బట్టి యేవి చిత్తవృత్తులో యేవి కావో పరిశీలింతము

రతి —యువతీయువకులందు అన్యోన్యాలంబనము కార ణముగా గలుగు ప్రేమయనెడి చిత్తవృత్తివిశేషము రతి "ప్రీపుం సయో రన్యోన్యాలంబనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తివిశేషో రతిః

కై స్నై ర

స్థాయిభావః" రతి చిత్తవృత్తివిశేషమని లక్షణమున వాచ్యముగనే యున్నది అదియుగాక యిది మనఃప్రవృత్తి యను సత్యము స్త్రీపురుషులెల్లరకును అనుభవసిద్ధమే

హాసము —"వాగంగాది వికారదర్శనజన్మా వికాసాఖ్యో హాసః" అను లక్షణమును బట్టి వికృతాకార వాగ్వేషచేష్టాదుల దర్శనమువలన గలిగిన చిత్తవికాసము హాసమని తెలియుచున్నది రదనప్రకాశన నయనవికాస అశ్రుపాతాదులగు కార్యములచే అంతరంగప్రవృత్తి వ్యక్తమగుచున్నది ఈ అనుభావాద్యుత్పత్తికి దైహికములగు కారణము లేవియు లేకుండుటవలన చిత్తవృత్తియే కారణమని అంగీకరింపవలెను

శోకము —"పుత్రాది వియోగ మరణాది జన్మా వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేష శ్శోకః అని లక్షణము. ఆప్తులు, ప్రియులు నగు వారికి కలిగిన మహానర్థము వారివలని యెడబాటు మున్నగునవి కారణములుగా చిత్తమునకు వైక్లబ్యము కలిగినది ఈ అలజడి మనస్సునకు సంబంధించినది యనుట సువ్యక్తము రోదన దీర్ఘనిశ్వాసాద్యనుభావములును నిర్వేదాది సంచారులును దీనివలన గలుగుచున్నవి కనుక శోకము చిత్తవృత్తి కాకతప్పదు.

క్రోధము —గురుబంధవధాది పరమాపరాధములు కారణములుగా కలిగిన చిత్తప్రజ్వలనము క్రోధము చిత్తమునకు గలిగిన యీ అలజడి కారణముగా భ్రుకుటీభంగ రదనపీడన నేత్రరక్తిమాదులగు ననుభావములు కలుగుచున్నవి దైహికములగు నీ మార్పులకు చిత్తప్రజ్వలనమే హేతువగుటచే క్రోధము చిత్తవిశేషమని నిశ్చయమగుచున్నది

ఉత్సాహము —"పరపరాక్రమ దానాది స్మృతిజన్మా ఔన్నత్యాఖ్య శ్చిత్తవృత్తివిశేష ఉత్సాహః" అని లక్షణము ఉదాత్త కార్యనిర్వహణాదులందు ఇతరుల నధిగమింపవలెననెడి చిత్తౌన్నత్యము కారణముగా ముఖవికాసాద్యనుభావములు కలుగుచున్నవి అట్టిచిత్తవృత్తికి లోనైనవ్యక్తి అసాధారణప్రయత్నాదికములందు ప్రవర్తిల్లును

భయము —"వ్యాఘ్రదర్శనాదిజన్మా పరమానర్థవిషయకో వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః భయం" వ్యాఘ్రము విషసర్పము, క్రూరశత్రువు మున్నగువానిని చూచుటవలన మరణాదికమగు భీతి మనస్సున నేర్పడి తత్ఫలముగా కంపనము, ముఖశోష ఇత్యాదను భావములు కలుగును ప్రాణరక్షణార్థమై పరుగిడుట, అరచుట మున్నగు చేష్టలయందు వ్యక్తి ప్రవర్తిల్లును చిత్తము భావప్రాబల్యమునకు లోనగుటయే యిందులకు హేతువు

విస్మయము —"అపూర్వవస్తుదర్శనా చ్చిత్తవిస్తారో విస్మయో మతః" "అలౌకికవస్తుదర్శనాదిజన్మా ఆశ్చర్యాఖ్యో విస్మయం" అలౌకికము, అసాధారణము, అపూర్వము నగు వస్తు దర్శనమువలన గలుగు చిత్తవిస్ఫూర్తి విస్మయ మనెడి లక్షణమును బట్టియు విస్మయమునకులోనైన వ్యక్తుల చేష్టాద్యనుభావములను బట్టియు నిది భావమని నిశ్చయమగుచున్నది

జుగుప్స —"కదర్యవస్తువిలోకనజన్మా విచికిత్సాఖ్య శ్చిత్తవృత్తివిశేషో జుగుప్సా" అని లక్షణము పురీషాదివస్తువులను జూచుటవలన మనస్సున కేవగింపు కలుగుటయు వ్యక్తి తద్వస్తువులనుండి దూరముగ బోవ ప్రయత్నించుటయు జరుగును ముఖసంకోచ నిష్ఠీవనాది చేష్టలును నొకప్పుడు వమనాదికమును కూడ జరుగవచ్చును దైహికములగు నీకార్యములన్నిటికిని చిత్తవృత్తియే హేతువనుట సువ్యక్తము

ఇట్లు రతిహాసశోకాదులగు నెనిమిదియు సంపూర్ణముగ చిత్తవృత్తులని నిర్ణయమగుచున్నది ఇక సంచారులను బరిశీలింతము

నిర్వేదము —"నీచపురుషేషు ఆక్రోశన అధిక్షేప వ్యాధి తాడన దారిద్ర్య ఇష్టవిరహ పరసంపద్దర్శనాదిభిః ఉత్తమేషు తు అవజ్ఞాదిభిః జనితా విషయద్వేషాఖ్యా రోదన దీర్ఘశ్వాస దీనముఖాది కారిణీ చిత్తవృత్తి ర్నిర్వేదః" అతిశయమగు దుఃఖ ఈర్ష్యా తిరస్కారాదుల వలన చిత్తమునకు విషయములందు గలుగు అరతి నిర్వేదమని లక్షణము నిశ్వాస రోదనాదు లిందనుభావములు ప్రాపంచికవిషయములందు విముఖత చిత్తసంబంధి యనక తప్పదు.

చపలత —"అమర్షాదిజన్యా వాక్పారుష్యాది కారణీభూతా చిత్తవృత్తి శ్చపలతా" "మాత్సర్యద్వేషరాగాదే శ్చాపల్యం తు అనవస్థితిః" అను లక్షణములను బట్టి చిత్తమునకు గలిగిన అనవస్థితియే చాపల్య మని తెలియుచున్నది జడత యను చిత్తస్థితి కిది పూర్తిగ విరుద్ధమగుట చిత్తప్రవృత్తియగును

అవహిత్థ —"వ్రీడాదిభిర్నిమిత్తై ర్హర్షాద్యనుభావానాం గోపనాయ జనితో భావవిశేషోఽవహిత్థమ్"

భావప్రాబల్యకారణముగా కలిగిన హర్షపులకాది కార్యములను మరుగుపరచుటకై మనమున కలిగిన భావవిశేషము అవహిత్థ యనుటచే వ్రీడాదు లిందు విభావములగును అనుభావాదులను చూచి యితరులు మనోగతభావమును గుర్తెరుంగుదురని తెలియుటయు తదనుభావములను మరుగుపరచు ప్రయత్నమున కింద్రియములను పురికొల్పుటయు మనోవ్యాపారమే యగుటచే అవహిత్థ చిత్తవృత్తి యగుచున్నది

త్రాసము —"ఆకస్మికభయా చ్చిత్తవిక్షోభ స్త్రాసః అను లక్షణమునుబట్టి దీనిని భయమనెడు స్థాయిభావమున చేర్పవచ్చును

జనను విభావముల విషయమునను, సందర్భమువిషయమునను గల భేదములను బట్టి త్రాసము తాత్కాలికము అల్పము నగుటచే సంచారిగా పరిగణింపబడినది భయత్రాసములకుగల భేద మెట్టి దైనను త్రాసము చిత్తవృత్తి యనుట నిస్సందేహము

శంక — "కిమనిష్టం మమ భవిష్యతీత్యాకార శ్చిత్తవృత్తి విశేష శ్శంకా" అనిష్టమగు కార్యము జరుగునేమో యనెడి జంకు చిత్తవృత్తియే ముఖవివర్ణత కంపము పనులయందు తొట్రుపాటు భ్రమితములేకుండుట మున్నగువానికిది హేతువగుచున్నది

హర్షము — "ఇష్టప్రాప్త్యాదిజన్మా సుఖవిశేషో హర్షః" ప్రసన్నముఖనేత్రములు మాటలయందు తొట్రుపాటు పులకాంకుర స్వేదాదులు అశ్రుపాతము ఇత్యాది కార్యములచే నీచిత్తవృత్తి వ్యక్తమగుచున్నది

దైన్యము — "దుఃఖ దారిద్ర్యాపరాధజనితా స్వాపకర్షకార ణాదిహేతు శ్చిత్తవృత్తివిశేషో దైన్యమ్"

అతిశయదుఃఖ దారిద్ర్యాదులవల్ల వ్యక్తికి స్వశక్తిసామర్థ్యము లందు విశ్వాసము నశించుటయు తత్కారణముగా నతడు తన్ను గూర్చి జాలిపుట్టునట్లు పలుకుటయు మున్నగునవి లోకవృత్తములు కనుక దైన్యము చిత్తవృత్తియనుట నిస్సందేహము

ఉగ్రత — "అధిక్షేపావమానాదిప్రభవా కిమస్య కరోమి ఇత్యా ద్యాకారా చిత్తవృత్తి రుగ్రతా" అవమానము నింద మున్నగువాని వలన చిత్తమున కొక్కసారిగా గలుగు ప్రజ్వలన ముగ్రత ప్రచండమగు నీచిత్తవృత్తిచే నవేచ్ఛ బొడమున్నది వ్యక్తి తన్ను మరచి పరునిపై బడి కొట్టుట వధించుట మున్నగు ప్రవర్త నకు లోనగును ఈచిత్తవృత్తి చాలకాలముండునదికాదు. క్షణిక మైనది ఉగ్రతకు లోనై దీర్ఘకాలము ప్రవర్తించుటకు చిత్తమునకు సామర్థ్యములేదు కావున నిది సంచారి యగుచున్నది క్రోధము చిరకాలము నిలిచి యుండునది కావున నది స్థాయి యగుచున్నది

"నాస్యహో క్రోధః తస్య స్థాయిత్వేన అస్యాః సంచారిణీత్వే నైవ భేదాత్" అని ఉగ్రతకును క్రోధమనెడి స్థాయిభావమునకును గల భేదమును రసగంగాధరకారుడు వివరించినాడు

చింత — "ఇష్టాప్రాప్త్యనిష్టప్రాప్త్యాది జనితా ధ్యానపర పర్యాయా వైవర్ణ్య భూలేఖన అధోముఖత్వాది హేతు శ్చిత్త వృత్తివిశేష శ్చింతా"

ఇష్టమైనది సిద్ధింపకుండుటయు అనిష్టమైనది జరుగుటయు మున్నగు కారణములవలన గలిగిన ఆధ్యానమనెడి చిత్తవృత్తియే చింత వైవర్ణ్యము శూన్యదృష్టి, నిశ్వాసము నేలవ్రాయుట తల వంచుకొనియుండుట, యిత్యాదులచే నీచిత్తవృత్తి వ్యక్తమగు చున్నది

అసూయ — "పరోత్కర్షదర్శనాదిజన్యః పరనిందాది కారణీభూత శ్చిత్తవృత్తివిశేషో ఽసూయా"

ఇతరుల యుత్కర్షను చూచి సహింపలేని మనః ప్రవృత్తి అసూయ వారియెడ కోపముగ ప్రవర్తించుట, తూలనాడుట, యిత్యాదులచే నీ మనోభావము వ్యక్తమగుచున్నది

అమర్ష — పరకృతమగు అవజ్ఞాద్యపరాధమువలన జనించిన కోపవిశేషమే అమర్షమని యిదివరకే వివరింపబడి యున్నది క్రోధభేదముగా దీనిని పరిగణించుటకును నవకాశము న్నది ఎట్లున్నను రోషము చిత్తవృత్తియనుటలో సందేహములేదు

గర్వం — "గర్వోమదః ప్రభావ శ్రీ విద్యా సత్కులతాదిజః" "రూపధనవిద్యాదిప్రయుక్తాత్మోత్కర్షజ్ఞానాధీన పరావహేలనం గర్వః" అను లక్షణములనుబట్టి ఆత్మోత్కర్షజ్ఞానమువలన గలిగి నదియు పరులను నిరసించునదియు నగు చిత్తవృత్తి గర్వమని తెలియుచున్నది ఇతరులను గణింపక పలుకుట, ఆటోపముగ నడచుట మున్నగు చేష్టలచే గర్వము వ్యక్తమగుచున్నది

వ్రీడ — "స్త్రీణాం పురుషముఖావలోకనాదేః పుంసాం చ ప్రతిజ్ఞాభంగపరాభవాదే రుత్పన్నా వైవర్ణ్య అధోముఖత్వాది కారణీభూత శ్చిత్తవృత్తివిశేషో వ్రీడా" ప్రతిజ్ఞాభంగపరాభవాదులు కారణములుగా పురుషులయందును పురుషముఖావలోకనాదులచే స్త్రీలయందును గలుగు చిత్తవృత్తివిశేషము వ్రీడ వైవర్ణ్యాధో ముఖత్వాదులకు చిత్తవృత్తియే కారణము

ఆవేగము — ప్రియాప్రియప్రాప్తి సందర్భమున గలిగిన మనస్సంభ్రమము ఆవేగము

"అనర్థాతిశయజనితా చిత్తస్య సంభ్రమాఖ్యావృత్తిరావేగం" అను లక్షణమును బట్టియు నిది చిత్తవృత్తియే ఇక, అనర్థాతిశయ మును మాత్రమే విభావముగా చెప్పనవసరములేదు ప్రియము సిద్ధించినప్పుడు కూడ మనస్సునకు సంభ్రమము కలుగవచ్చును

వితర్కము — "తర్కో విచారః సందేహాత్"
"సందేహాద్యనంతరం జాయమాన ఊహో వితర్కః"

అను లక్షణములను బట్టి సందేహమేర్పడినపుడు తన్నిర్ణయజ్ఞాన మునకు తోడ్పడు ఊహ వితర్కమని తెలియుచున్నది సందేహ విషయమున నిశ్చయమునకు సాధనమగునది చిత్తప్రవృత్తియే యగుట నిస్సందియము

విషాదము — "ప్రారబ్ధకార్య అసిద్ధ్యాదే ర్విషాదః"
"ఉపాయాభావజన్మాతు విషాదః సత్త్వసంక్షయః"

అను లక్షణమునుబట్టి, ప్రయత్నసిద్ధి కాకుండుటవలనను నిస్సహాయతాదులవలనను గల్గు అనుతాపము విషాదమని తెలియు చున్నది ముఖసంకోచ, నిశ్వాసాదులచే విషాదము వ్యక్తమగును

ఔత్సుక్యము :—"అధునైవ స్యలాభో మమాస్తు ఇతీచ్ఛా ఔత్సుక్యమ్" అను లక్షణమును బట్టి ఇష్టవిషయమును బొందుటలో మనస్సు చెందెడి తొందరపాటు ఔత్సుక్యమని తెలియు చున్నది వాంఛితమును బొందువిషయమున చిత్తమునకు గల తొందరపాటు అనుటచే నిది చిత్తవృత్తియనుట నిక్కము

ఇట్లే పదునేడు సంచారులను సంపూర్ణముగా చిత్తవృత్తులని నిర్ణయింపవచ్చును ఇక,—

> గ్లాని —"రత్యాయాస మనస్తాప క్షుత్పిపాసాది సంభవా
> గ్లాని ర్నిష్ప్రాణతాకంపకార్యానుత్సాహతాదికృత్"
> "ఆధివ్యాధిజన్య బలహానిప్రభవో వైవర్ణ్యశిథిలాంగత్వ
> దృగ్భ్రమణాదిహేతుః దుఃఖవిశేషో గ్లానిః"

సురతాయాస మనస్తాప క్షుత్పిపాసాదులవలన గలిగినది గ్లాని యనియు ఆధివ్యాధిజన్యమగు బలహానతవలన గలిగిన దుఃఖవిశేషము గ్లానియనియు వివరింపబడినది దుఃఖవిశేషమే గ్లాని యగుచో నిది శోకమునం దంతర్భావమును బొందగలదు మరియు సురతాయాసము కారణముగా మనస్సునకుగలిగిన అనుభవము దుఃఖ విశేషము కాజాలదుకదా? వైవర్ణ్య శిథిలాంగత్వ దృగ్భ్రమణాదు లకు బలనాశ ఆయాసములు హేతువులగుచున్నవే కాని చిత్త ప్రవృత్తికాదుకదా? కావున గ్లాని చిత్తవృత్తియా యను విషయము సందేహగ్రస్తము

శ్రమ —"శ్రమః ఖేదోఽధ్వగరత్యాదేః

"బహుతర శారీరవ్యాపారజన్మా నిశ్వాసాంగసమ్మర్దకారణీభూతః ఖేదవిశేషః శ్రమః' ప్రయాణము సురతము వ్యాయామము మున్నగు శారీరవ్యాపారాదులు కారణములుగా కలిగిన ఖేదవిశేషము శ్రమ యని లక్షణము నిశ్వాస అంగసమ్మర్ద, నిద్రాదులు అను భావములుగా పేర్కొనబడినవి శరీరవ్యాపారమువలన కలిగిన అలసట దేహమునకు సంబంధించినదియే కాని మనస్సునకు సంబంధించినది కాదుకదా? శరీరవ్యాపారాతిశయమువలన మనస్సు నకు కూడ అలసటకలుగువచ్చునని యొప్పుకొన్నను అలసటను చిత్తప్రవృత్తి యన వీలులేదుకదా? అలసట చైతన్యమును తగ్గించు నదియే కాని ప్రవర్తింపజేయునది కాదు మరియు, సురతాదిక వ్యాపారముచే దేహమునకు అలసట గలిగినను మనస్సునకు గల్గు నది ఉల్లాసమే యగును గాని ఖేదము కాజాలదు కదా? ఈ కారణ ములనుబట్టి శ్రమ చిత్తవృత్తియనుట విమర్శనీయాంశము కావున శ్రమ మనసునకు గలిగిన అనుభూతివిశేషమే యనియు, నిది గ్లానివంటిదే యనియు చెప్పవలెను

ధృతి :—"జ్ఞానాభీష్టాగమాద్యైస్తు సంపూర్ణస్పృహతా ధృతిః" అను సాహిత్యదర్పణలక్షణమును బట్టి అభీష్టసిద్ధివలన సంపూర్ణమగు మనస్సంతృప్తి లేక కృతార్థతధృతి యని తెలియుచు న్నది ఇది ప్రశాంతమగు చిత్తస్థితిని సూచించుచున్నది "చాపలా ద్యుపశమోనుభావః' అని మనస్సు చాపలమునుండి యుపశమించి యుండుట అనుభావముగా జగన్నాథుడు పేర్కొనియుండుటయు "ప్రాప్తానామ్ ఉపభోగః అప్రాప్తే నశోకః," అని ప్రాప్తించిన దాని ననుభోగించుట ప్రాప్తింపనివానికై వెతపడకుండుట అనునవి ధృతిలక్షణములుగా నాట్యశాస్త్రము వివరించియుండుటయు కారణ ములుగా ధృతి యనునది చిత్తస్థితియేకాని చిత్తవృత్తి కాదని తెలియుచున్నది

ఆలసత —అతితృప్తి గర్భ వ్యాధి శ్రమాదిజన్మా చేతసః క్రియాసమ్ముఖతా ఆలస్యం క్రియల విషయమున మనస్సు నకు గలిగిన వైముఖ్యము ఆలస్య మగుటవలన నిదియు చిత్త స్థితియే గాని చిత్తవృత్తి కాదని తెలియుచున్నది క్రియాప్రవృత్తి యందు వైముఖ్యమును చిత్తప్రవృత్తిగా నెన్నుట యెట్లు?

జడత —"చింతోత్కంఠా భయ విరహ ఇష్టానిష్టదర్శన శ్రవణాదిజన్యా అవశ్యకర్తవ్యార్థప్రతిసంధానవికలా చిత్తవృత్తి ర్జడతా" చింత భయము విరహము ఇష్టానిష్టదర్శనశ్రవణాదులు కారణములుగా జడత కలుగుననియు నిది కారణముగా నవశ్య కర్తవ్యములవిషయమునను వ్యక్తి విమూఢుడగుననియు లక్షణము చింతాదులు విభావములనియు ఇతికర్తవ్యతావిమూఢత్వ మనుభావ మనియు ఆశయము కాని ఇతికర్తవ్యతావిమూఢత్వము చిత్తము యొక్క స్థితివిశేషమని యేల చెప్పకూడదు? (చింతాదులు కారణ ముగా చిత్తము జడతారూపమున ప్రవర్తిల్ల విమూఢత్వమును కలి గించుననుట మాననమనస్తత్వముతో సమన్వయమగునా?)

స్మృతి —"సంస్కారజన్యం జ్ఞానంస్మృతిః' సంస్కార రూపమున నున్న పూర్వానుభవజ్ఞానము స్మృతి యని యర్థము సదృశవస్తువుయొక్క అవలోకనచింతనాదుల కారణముగా పూర్వాను భూతమగు విషయము చిత్తమునకు వచ్చుట స్మృతి యని ఆశ యము సంస్కారరూపమున నణగియున్న అనుభవము ప్రతి బోధకువచ్చుట చిత్తవృత్తి యెట్లగుచున్నది? పూర్వానుభవము ప్రతిబోధకు వచ్చుటకు కారణభూతమైన చిత్తప్రవృత్తి స్మృతి యన్నచో పైలక్షణము కుదురదు కనుక స్మృతి చిత్తమునందు జరుగు నొక వ్యవస్థాపరిణామమే యగుచున్నది కాని చిత్త ప్రవృత్తికాదు

మరణము :—"రోగాదిజన్యా మూర్ఛారూపా మరణప్రాగవస్థా మరణం" మూర్ఛారూపమగు మరణపూర్వావస్థయే మరణమని గ్రహించినను నది చిత్తవృత్తి కాజాలదుకదా ? మరణమునకున్ముఖమగు చిత్తప్రవృత్తి యని చెప్పవలెనే యిది భావము కాగలదు

మదము —"హర్షోత్కర్షో మదః" అను లక్షణమువలన నించుచో నిది హర్షభేదమే యగుచున్నది

"మద్యాద్యుపయోగజన్మా ఉల్లాసాఖ్యః శయనహసితాదిహే

తు శ్చిత్తవృత్తివిశేషో మదః"

మద్యపానాదులవలన చిత్తమునకు గలిగిన ఉల్లాసము మదమనియు నిద్రాహసితవాచాలతలు కార్యములనియు అర్థము మోహసంతోషములు ఏకకాలమున కలుగునవియు వానికలయిక మదమనియు కూడ వివరించినారు "సమ్మోహానందసందోహో మదో మద్యోపయోగజః" మదిరాదిద్రవ్యముల యుపయోగముచే మోహము కలుగవచ్చును కాని ఆనందము కలుగుననుట సందేహము మద్యపానమువలన నింద్రియములు ప్రకోపించి నిద్రావాచలతాది కార్యములను కలుగజేయుచున్నవా లేక ఉల్లాసమనెడి భావము మద్యపానముచే నుద్బుద్ధమగుచున్నదా యని ప్రశ్న కావున మదమును చిత్తవృత్తి యనుట పొసగదు

సుప్తి —నిద్రామగ్నస్య విషయానుభవ స్స్వప్నః కోపావేగభయగ్లాని సుఖదుఃఖాదికారకః" నిద్రయందున్న వ్యక్తికి గలుగు విషయానుభవము స్వప్నము జాగ్రదవస్థయందు వ్యక్తి అనుభవింపగల సుఖదుఃఖాది భావములన్నిటిని వ్యక్తి స్వప్నము నందును ననుభవింపగలడు ఇది అంతశ్చైతన్యముయొక్క విపరీతప్రవృత్తి యని చెప్పవచ్చును

నిద్ర —"శ్రమాదిప్రయోజ్యం చేతస్సమ్మీలనం నిద్రా" శ్రమాదులు కారణములుగా కలిగిన చిత్తసమ్మీలనము నిద్రయగుచో నది చిత్తవృత్తియగుట యెట్లు? చిత్తప్రవృత్తి ఆగుటయేకదా నిద్ర ? దీని నొక చిత్తస్థితి యనవచ్చునే కాని చిత్తవృత్తి యనజాలము

విబోధ —"నిద్రానాశోత్తరం జాయమానో బోధో విబోధః" నిద్రానంతరము గలుగు మెలకువ విబోధము అక్షిమర్దన జృంభాదు లనుభావములుగా పేర్కొనియున్నారు మెలకువ చిత్తముయొక్క స్థితియే కాని ప్రవృత్తి కాదనుటకు వీలున్నది జాగ్రదవస్థకు చిత్తమువచ్చుటయే కదా విబోధ? అట్టి పూర్వావస్థను తదనంతరప్రవృత్తి యనుట యెట్లు ?

అపస్మారము —"వియోగ శోక భయ జుగుప్సాదీనామతిశయాత్ గ్రహావేశాదేశ్చ ఉత్పన్నో వ్యాధివిశేషోపస్మారః" ప్రియవియోగము, శోకము మున్నగువాని అతిశయమువలన గలిగిన వ్యాధివిశేషము అపస్మారమనుటవలన నిది చిత్తవృత్తి కాదని తోచుచున్నది వియోగాదులవలన చిత్తస్వాస్థ్యమునకు కలిగిన భంగమే వ్యాధివిశేషమన్నను అపస్మారము చిత్తస్థితియగునే కాని చిత్తప్రవృత్తి కాదని చెప్పవలసివచ్చును

మోహము :—"భయవియోగాది ప్రయోజ్యా వస్తుతత్త్వానవధారిణీ చిత్తవృత్తి ర్మోహః' అను లక్షణముబట్టి మోహము చిత్తముయొక్క అస్వస్థస్థితి యని చెప్పవలసియున్నది వస్తుతత్త్వమును తెలియజాలనట్టి చిత్తస్థితి వియోగాదికారణముగా నేర్పడినది మోహో విచిత్తతా భీతిదుఃఖావేగానుచింతనైః అను లక్షణము ననుసరించి భీతి దుఃఖావేగాదుల కారణముగా కలిగిన విచిత్తతయే మోహమని తెలియుచున్నది విచిత్తతను చిత్తప్రవృత్తి యనుటకు వీలులేదు కావున మోహము చిత్తస్థితియే కాని చిత్తవృత్తికాదు

మతి —"శాస్త్రాదివిచారజన్యం అర్థనిర్ధారణం మతిః" అను లక్షణమును బట్టి అలజడిలేని మనస్థితి మతి యని తెలియుచున్నది శాస్త్రవిచారముచే అర్థనిర్ణయమైనపిమ్మట మనస్సునకు ప్రవృత్తి యెట్టిది? హర్షమో సంతుష్టియో కలుగవచ్చును

వ్యాధి —"రోగవిరహాదిప్రభవో మనస్తాపో వ్యాధిః" రోగాదికారణములుగా మనస్సునకు గలిగిన తాపము వ్యాధి యన్నచో నది చిత్తమునకు గలిగిన యనుభవమే కాని చిత్తవృత్తి కాజాలదు

ఉన్మాదము —"విప్రలంభ మహాపత్తి పరమానందాదిజన్మా అన్యస్మిన్నన్యావభాసః ఉన్మాదః" విప్రలంభ మహాపదాదులు కారణములుగా జనించినట్టిదియు ఒక వస్తువును మరియొకవస్తువుగా భ్రమింపజేయునట్టియు చిత్తవృత్తివిశేష మున్మాదము

"చిత్తసందేహ ఉన్మాదః కామశోకభయాదిభిః"

అను లక్షణమునుబట్టియు చిత్తసమ్మోహ మున్మాదమగుచున్నది ఇది చిత్తముయొక్క స్థితివిశేషమే కాని ప్రవృత్తియని చెప్పలేము చిత్తస్వాస్థ్యమును గోల్పోవుటయేకదా ఉన్మాదమునకు కారణము?

ఇట్లీ పదునాలుగును సంపూర్ణముగ చిత్తవృత్తులా యను విషయమున సందేహమున కాస్పదమున్నది ఐనను వివిధములగు నీ వ్యవస్థలన్నియు నంతరంగమునకు సంబంధించియుండుటయు సారవంతమగు భావమునాధారమున నేర్పడుటయు కారణములుగా నీనిని చిత్తవృత్తిభేదములుగా ఆలంకారికులు పరిగణించినారు కావున భావములసంఖ్య వలుబదియొక్కటి యను పరిణామము సంప్రదాయముగ నేర్పడినది వీనిలో పందారులగు మున్నది

మూడు భావములను అల్పవిభావములవలన నుత్పన్నమై తాత్కాలికముగ మాత్రమే ప్రవర్తించుననియు కనుక అవి రసపర్యవసానములు కాజాలవనియు ముందే వివరింపబడినది ఇక స్థాయిభావములగు రత్యాదులన్నిటికిని రసముగ పర్యవసించు శక్తి కలదని చెప్పుటకును వీలులేదు మానవజీవితమునందు మిక్కిలి ప్రధానములుగా వర్తించునవి రత్యుత్సాహములు రెండే యని అంగీకరింపక తప్పదు అనురాగము వాత్సల్యము ప్రేమ భక్తి మధురము ఇత్యాదులన్నిటికిని రతిభావమే మూలమనుటలో విప్రతిపత్తిలేదు ఏదో యొక రూపమున మానవజీవితమునంతను రతిభావ మాత్రమించియున్నది కావున రతి రసముగ పర్యవసించి ఆనందమును గూర్పకలదు అటే మానవుని ప్రయత్నసర్వస్వమునకును ఆతడొనర్చు ప్రతికార్యమునకును ఉత్సాహమే మూలము ఉత్సాహశూన్యమగు మానవజీవితము నిరర్థకమనుట నిస్సందేహము కావున ఉత్సాహము కూడ రసముగ పర్యవసింపగలదు శోకము కూడ జీవితమున సర్వసాధారణము మానవమాత్రుడైనవానికి ఇష్టజనవినాశక్లేశాదులు తప్పనివగుటచే శోకము మనలను వెన్నాడుచునే యుండును కావున శోకము కూడ కరుణగా నాస్వాద్యమానమగుచున్నది రత్యుత్సాహశోకములకు జీవితమున గల ప్రాధాన్యము హాసక్రోధాది యితరభావములకు కలుగదు హాసక్రోధభయవిస్మయజుగుప్సలు జీవితమునం దప్పుడప్పుడు ప్రవృత్తమగుచు మరుగుపడుచుండునే కాని సార్వకాలికముగ ప్రవర్తింపవు వీరశృంగారములు ననుభవించిన విధమున చిరకాల మితరముల ననుభవింపజాలము హాస్యప్రధానములగు ప్రహసనములు నాటక ప్రకరణములవలె దీర్ఘరచనలు కాకుండుటకిదియే కారణము జీవితమునందు ఉచితసందర్భములలో హాస్యమును తాత్కాలికముగ మాత్రమే ఆస్వాదించి యానందింపగలము క్రోధమొకప్పుడు జీవితమున చిరకాలము నిలిచియుండవచ్చును కాని తదాస్వాదనము మాత్రము సార్వకాలికమైనదికాదు రౌద్రమును సర్వకాలసర్వావస్థలయందును అనుభవింపగల సామర్థ్యము మనస్సునకు లేదు అట్లే భయవిస్మయజుగుప్సాదులకు గూడ జీవితమున ప్రాధాన్యము తక్కువ కావున నీ భావములు రత్యుత్సాహములవలె రసపర్యవసితములై ఆనందమును కలిగించునా యను సందేహము కలుగకమానదు భయజుగుప్సాదుల నాదినుండి తుదివరకును విభావానుభావక్రమమున పోషించి రచించిన కావ్యములు దృశ్యములు ఇవి కావ్యనాటకములలో నందందు అంగములుగా పోషితములైయున్నవే కాని అంగిరసములుగా పోషితములు కాలేదు వివిధభావముల శక్తిసామర్థ్యములను వానికి జీవితముతోగల సంబంధమును, మానవమనస్తత్వమును గుర్తించియే భరతాద్యాలంకారికులు శృంగారవీరములనుమాత్రమే నాటకార్హములగు రసములని నిర్ణయించినారు ఇక లౌకికజీవితమున స్థాయిభావోత్పత్తికి హేతువులగు విభావముల విషయమునకూడ మానవచిత్తప్రవృత్తియందు వైవిధ్యముండుటకు వీలున్నది మానవ మనస్తత్త్వవైవిధ్యము జీవితపరిస్థితుల వైవిధ్యము మున్నగునవి ఇందుకు హేతువులగుచున్నవి ఒకానొకయువతియొక్క సౌందర్యాదులను ముగ్ధుడై యొకివ్యక్తి (యొకవ్యక్తి) రతిభావమునకు లోనుకావచ్చును తద్భావప్రాబల్యమతనియందు చేష్టాదిరూపకానుభావములను గూడ కలిగింపవచ్చును తావలచిన యువతియెదుట తన యనురాగమును ప్రకటింపవచ్చును అంతమాత్రముచే నాయువతియందు రతిభావోదయము కలుగునని చెప్పజాలము తద్విరుద్ధముగ విసుగో కోపమో కలుగుట కూడ ప్రకృతిసిద్ధమగువిషయమే (దీనినే రసాభాసగా అలంకారికులు పేర్కొనియున్నారు) ద్రౌపదీ విషయమున కీచకుని ప్రవృత్తి యిట్టిదే అట్టి సందర్భములలో సామాజికులయందుకూడ అమర్షము కలుగునే కాని రతి ఉద్బుద్ధము కాజాలదుకదా? అభినవకౌముదిని వలచిన కల్యాణుని ప్రవర్తనకూడ ఇందు ననుసంధింపవచ్చును సాత్త్వికుడగు పాండునకు కల్యాణుని హృదయగత భావముతో సామభూతిసామరస్యము లేర్పడజాలవు తద్విరుద్ధభావములే యుప్పతిల్లును స్త్రీహృదయమున రతిభావము నుత్పన్నము చేయుటకు అనుకూలములైన గుణములు పురుషునియందును అట్లే ఆ పురుషునియందు రతిభావోత్పత్తి కనుకూలములగు గుణములా స్త్రీయందును నున్నప్పుడే వారన్యోన్యము విభావములు కాగలరు ఏదియో ఆంతరమగు నొకానొక సంబంధము ఇరువురియందును ప్రకృతిసిద్ధము ఉన్నప్పుడే విభావానుభావమగు భావోదయము కలుగగలదు ఈ విషయమునే భవభూతి

"వ్యతిషజతి పదార్థా నాంతరః కోపి హేతుః
న ఖలు బహిరుపాధీ న్ప్రీతయః సంశ్రయన్తే"

అను వాక్యమున సూచించినాడు

మరియు రతిభావావిష్టులైయున్న ప్రేయసీప్రేయసుల నాలోకించుటచే నెల్లవారియందును సర్వావస్థలయందును రతిభావోదయమగుననియు చెప్పజాలము తదాలోకనకాలమందు వ్యక్తియొక్క మానసికస్థితిని బట్టియు పరిస్థితులను మున్నగువానినిబట్టి యీ విషయము నిర్ణయమగుచున్నది ప్రియురాలి మరణముచే తపించు

యున్నవాని హృదయము అట్టివిభావమువలన శోకాక్రాంతమగుటయు మానవప్రకృతికి సహజమే కావుననే చిత్తము భావాంతరస్పృష్టమైయుండకూడదను విషయము

"నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమవిక్రియా"

యను వాక్యమున వివరింపబడినది చిత్త మన్యభావాక్రాంతమై యుండుట భావవైపరీత్యమునకును హేతువు కాగలదు. శత్రువు లగువారి యింట జరుగు వివాహమహోత్సవదర్శనముచే హర్షమునకు బదులు అసూయకలుగుటయు సహజమే యనను అట్టి సందర్భము చిన్నపిల్లల హృదయమున మాత్రము హర్షమునే కలిగించునను గమనింపదగిన విషయము చిన్నపిల్లల హృదయములు విశుద్ధములై యుండుటయే యిందుకు కారణము కావున విభావానుభావ మగు భావోత్పత్తికి చిత్తము నిర్వికారము విశుద్ధమునై యుండు టెంతయు నవసరము రజస్తమోగుణస్పర్శలేని శుద్ధసత్త్వరూప మగు మనస్సునకు ఆనందమనెడి ధర్మము కలదనియు అదియే స్థాయియనియు కూడ వివరింపబడియున్నవి సమర్థము ప్రకృష్టము నగు విభావమును అనుకూలపరిస్థితులును నేర్పడినపుడే విశుద్ధమగు నంతఃకరణమున విభావానుభావమగు భావముద్బుద్ధమగుట కవకాశ మున్నది మరియు వ్యక్తి మనస్సునందు భావము వాసనా(సంస్కార) రూపమున నుండుట కూడ యవసరము అట్టిపరిస్థితులయందు బోధచెందిన భావము అనుభావాదులచే వికాసమును గాంచి వ్యాప్త నందుచున్నది దీనినే విభావాదిచర్వణాదికముచే సహృదయుని సత్త్వగుణ ముద్రిక్తమగుచున్నదనియు తదుద్రేకకారణముచే వాసనారూపమున నున్న స్థాయిభావము విభావానుగుణమగు రత్యాది రూపమున నుద్బుద్ధమగుననియు ఆలంకారికులు చెప్పుదురు విభావానుభావములు పదేపదే భావితములై వ్యభిచారులను స్ఫురింప జేయును అనగా విభావానుభావచర్వణము వ్యభిచారచర్వణమున పర్యవసించుచున్నది వ్యభిచారులనెడు చిత్తవృత్తుల చర్వణమున కూడ స్థాయిభావము తదాధారముగ మెఱుగుచునేయుండును హారమందలి మణులన్నిటికిని నాధారమగు సూత్రము లోపల నుండునట్లు స్థాయి ప్రవర్తిల్లునని దీనికి దృష్టాంతముగా నిచ్చియున్నారు ఇట్లు వ్యభిచారిచర్వణయందు స్థాయికూడ చర్వితమగు చున్నది కావుననే వ్యభిచారులు స్థాయికి పోషకములని చెప్పుట ఈ విభావానుభావవ్యభిచారి చర్వణమే రసస్ఫూర్తి కాధారము ఇట్లు చర్వితమైన స్థాయి చిత్తవృత్తియే పరిణతస్థితిలో రసముగా నాస్వాద్యమగునని కొందరిమతము స్థాయిభావము జడమగు నంతఃకరణధర్మము మాత్రమే యనియు రసము చిద్ఘనమగు నాత్మస్వరూప మగుటచే నది వేరనియు కొందరి మతము విభావానుభావచర్వణ మూలమున చర్వితమగు స్థాయియే రసచర్వణ మొదవించి దానిని సంస్కరించుననియు నప్పుడు రసము స్థాయి రూపోపహితమై ఆస్వాదింపబడుననియు వీరివాదము ఏది నిజమైనను విభావానుభావసంచారీభావముల చర్వణ రసానుభూతి కాధార మగుచున్నదనుటలో విప్రతిపత్తి లేదు ఇట్టి రసానుభూతి సామాజికుని విషయమున నెట్లు కలుగుచున్నదో పరిశీలింతము (సశేషం)



# బదనిక

పట్టికొండ ఆళ్వారు స్వామి

నా భర్త కాఫీతాగి, పాతపత్రికలన్నీ తిరగ వేస్తు కూర్చున్నారు

ఆదివారం ఆఫీసు హడావుడి ఉండ దని మామూలు పనులన్నీ ముగించుకొని శారద ఇంటికి వెళ్ళాను శారద ఇల్లు చూడ టానికి ఎంతో సంబరంగా ఉంటుంది శార దకు ఎంత స్వాతంత్ర్యం! ఎంత గౌరవం! ఆమె అంటే నౌకర్లందరికీ భయం ఆమె భర్తకూడా అదృష్టంకొద్దీ దొరికాడు ఎంత నెమ్మది మనిషి పల్లెత్తి మాట అని ఎరు గడు ఎంతో మర్యాదగా ఉంటాడు

నేను వెళ్ళేవరకు శారద ఫలహారం ముగించుకొని తాంబూలం వేసుకుంటూ "వీరయ్యా! వెంకటేశం ఇంకా మార్కెటు నుంచి రాలేదుకదూ!" అంటున్నది

"అవునమ్మ" సామానుగదిలోంచే జవా బిచ్చాడు వీరయ్య

వంటమనిషి వచ్చి చేతులు పిసు క్కుంటూ నిలుచున్నాడు

శారద నన్ను చూడటంతోనే "రండి, కూర్చోండి, పనులన్నీ ముగించుకొని వచ్చి నట్టున్నారు" అని పలకరించింది

"ముగియటానికి పనులకు అంతుండదు నీకేం, మహారాణా కదుపున ఒట్టావు నౌకర్లు చాకర్లు హాయిగా పని వెళ్లి పోతుంది మీవారు లేవట్టున్నారే" అంటూ పక్కకు మంచంమీద మడతపెట్టిఉన్న కొత్త చీరె అంచును పరీక్షగా చూడ సాగాను

"చీరె బాగుందంటారా?" శారద పాందాన్ మూతపెట్టూ అడిగింది

"మీరు తెప్పించిన చీరెలకు ఎంత ఉంటుందేమిటి?' చీర మడత విప్పుతూ అన్నాను

"వెంకటేశం అదే పోయ్యాడు ఎప్పుడు వస్తాడో" శారదకు వినిపించేట్టు వంటమనిషి గొణిగాడు

"ఎంత సేపైంది వెంకటేశం మార్కెటుకు వెళ్లి వాడి కెంతచెప్పినా బుద్ధిరాదు సోమరి వెధవ" శారద చీదరించుకుంటూ పక్కగదిలోకి వెళ్లి ఒక రవికెగుడ్డ పట్టు కొచ్చి నాచేతి కందించి "నీ అభిప్రాయ మేమ"న్నట్లు నన్ను చూచింది

"ఎలా తీసికున్నారండీ చాలా బాగుంది," పట్టలేని ఆనందాన్ని ప్రదర్శిస్తూ పరీక్షగా రవికెగుడ్డను చూడసాగాను

"మావారు ధరలు అడుగవద్దంటారు వస్తువు బాగుందా లేదా చూడమంటారు అంతే నిజమే మనమేం డబ్బుఇచ్చేది ఉందిగనకనా! పది రూపాయలకు గజం కంటే తక్కువేం ఉండదనుకుంటా చెప్ప మరచాను నీలంటే మీరుకూడా రండి ఇవ్వాళ నేను బట్టలు కొనడానికి బజారుకు వెళ్దామనుకుంటున్నాను మావారు రారు లెండి ఏమంటారు?" ప్రశ్నించింది శారద

ఇంతలో శారద ఇంటిముందర మోటారు ఆగిన చప్పుడు అయింది "వచ్చారు" అంటూ శారద వికసించిన ముఖంతో నన్ను చూచి బయటివైపు ఆతురతతో భర్తకు ఎదురుగుండా వెళ్లింది శారద ఆనందాన్ని పంచుకొని సిగ్గుతో పక్కగదిలోకి వెళ్లాను. శారద భర్త నేరుగా మేడపైకి వెళ్లాడు

డ్రైవరు ఏదో పొట్లాలు బుట్టలు తెచ్చి పెట్టాడు శారద వాటిని పరిశీలించసాగింది.

నేను గదిలోనుండి బయటికి రాగానే, డ్రైవరు నన్నుద్దేశించి "అమ్మా! అయ్య గారు బయట నిలబడిఉన్నారు మిమ్మల రమ్మంటున్నారు" అన్నాడు

"ఇంకేం పిలుపు రానేవచ్చింది ఏదో ముంచుకుపోయినట్టు" మనసులో అనుకొని "వస్తానమ్మ" విచారంతో అని ఇంటిలోన పట్టాను

తెచ్చిన వస్తువులు చూడాలనే ఆదుర్దా నన్ను బాధించింది

నా భర్త వెనుకకు తిరిగి తిరిగి చూస్తూ వడిగా ఇంట్లోకి వెళ్లుతున్నారు

నేను ఇంటికి వెళ్లేవరకు నాభర్త నా కొరకే అన్నట్టు పచారుచేస్తున్నారు

"ఏమండీ ఆదివారంగదా ఎక్కడి కివ్వాళ్ళగూడ" అని విసుగుతో అడిగాను.

"వెళ్లాలి పని ఉంది" అని గంభీరంగా అల్మారావద్దకివెళ్లి పుస్తకాలు వెదకసాగారు

"శారద ఇంట్లో చూచావండీ రవికె కణము అది చూడాల్సిందేకాని చెప్పతే అర్థంకాదు' అన్నాను

"ఊ!" అని పుస్తకం పట్టుకొని బయలుదేరారు

నా భర్త వెనుకాలే నడుస్తూ, "ఏమండి శారద బట్టలు కొనటానికి బజారు వెళ్తుందట నన్నుకూడా రమ్మన్నది పోదామనుకుంటున్నా" అని జవాబుకై ఆదుర్దాతో ఆగిపోయాను

"ఆమెవెంట వెళ్లడానికి వేరే దాసీలెవరు లేరా?" కోపంగా వెనుక తిరిగిచూస్తూ అని వడివడిగా వెళ్లిపోయాడు

"ఛీ! పాడుపుటక దేనికీ నోచుకోలేదు ఏదన్నా గడ్డిపోచను తీసేసినట్టే" అని గిరుక్కున వెనుకకుమళ్లి ఇంట్లోకి వచ్చాను గుడ్లనిండా తిరిగిన నీటిని కొంగుతో తుడుచుకొని అలవాటుగా ముక్కును గూడా చీంధించాను

కొద్దిసేపటికి శరీరభారం తీరినతర్వాత వంటపనులు ముగించుకొని భర్తరాకకై ఎదురుచూస్తూ తుంగచాపపై శరీరం వాల్చాను నిద్రలో లీనమయ్యాను

* * *

నా భర్త నిగనిగలాడుతున్న ఓ మోటారులో వచ్చారు డ్రైవరు పక్కను కూర్చున్న నౌకరు రాజయ్య హడావుడిగా మోటారు దిగి వెనుకభాగం తలుపు తెరిచాడు నా భర్త మోటారు దిగి మేడమెట్లెక్కుతూంటే, వారికోసం నిరీక్షిస్తు గదిలో కూర్చున్నవారంతా భయంతో లేచి భక్తితో దండం పెట్టారు

నా భర్త వారందరిని చూచిచూడనట్టు నడుస్తూ లాంఛనంగా దండాలను స్వీకరిస్తూ లోపలికి చేరారు

గదిలో తెరవెనుక నిలుచుండి నా భర్త రాకను తీవిని గమనించి చూస్తున్నవేళల వారు లోపలికిరాగానే పట్టరాని ఆనందాన్ని ప్రదర్శిస్తూ కౌగిటిలో చేరాను

నా భర్త నావీపు నిమిరి లాంఛనంగా ఒక ముద్దు పెట్టుకొని పడకగదిలో ఆవేశించాడు

అలసి సొలసి చెట్టునీడను విశ్రమిస్తులో నున్న వంటవాడిని పెద్ద కేకపెట్టి లెమ్మన్నాను లేవలేదు "ఒరే! మిట్టమధ్యాహ్నం నిద్ర ఏమిటిరా? దరిద్రుడా" అంటూ కాలుతో గట్టిగా అదిలించాను

"ఆఁ అమ్మగారూ!" అంటూ దిగాలుపడి లేచి చలిపెడుతున్నవాడివలె శరీరమంతా కుమ్మగాచేసికొని నడుమువంచి భయంతో కిందికి చూడసాగడు

"అయ్యవచ్చి ఎంతసేపైందో తెలుసా ఇంకా నిలుచున్నావా? త్వరగా అన్ని సిద్ధం చెయిపో" అని నేననగానే "అయ్యో వచ్చిండా? నాతెలివి పాడుగాను నిలబడి చూస్తున్నానే" అంటూ పశ్చాత్తాపంతో గడగడా వంటింట్లోకి వెళ్లాడు

"అమ్మా!" అని డ్రైవరు వచ్చి చేతులు నలుపుకుంటూ నిలబడ్డాడు

"చూడు! వాడుగున్నరవరకు వచ్చేశేయ్" అని నేను పెరట్లోకి వెళ్లి తిరిగి వచ్చేవరకు యింకా డ్రైవరు నిలుచునే ఉన్నాడు

"అమ్మా!" అని తిరిగి డ్రైవరు ఏదో చెప్పబోయి చిరుముఖంతో తల నేలకు వేశాడు

"ఏం సంగతి, ఇంకా నిలుచున్నావేం?" ప్రశ్నించాను

"ఈపూట సెలవు కావాల్నని అయ్యవడిగింటే అయ్య మిమ్ముల తెలిసికొని చెప్తానన్నారు" నీళ్లు మింగుతూ డ్రైవరన్నాడు

డ్రైవరు చెప్తున్నది లక్ష్యంచేయకుండానే "రాజయ్య నిట్లా రమ్మనిచెప్పు బజారునుంచి పండ్లు తెప్పించాలె ఇప్పటికే కావాలె భోజనంలోకి" అంటూ విసురుకుంటూ భోజనబల్లపై కూర్చున్నాను

నా భర్త ముఖం చిటచిటలాడుతుండగా, "రాజయ్యను నేనే ఇంటికి పొమ్మన్నాను మొదటే చెప్పించే వస్తూవస్తూ తెచ్చేవాండ్లంగా? సరేగాని, డ్రైవరు ఈపూట సెలవు కావాలంటున్నాడు తల్లికి బాగుండలేదట" అన్నాడు

రాజయ్య వెళ్లేటప్పుడు చెప్పైనా పోలేదే! ఇంట్లో అదో ఇదో అవసరముంటుందిగదా! మీరైనా ఆలోచించవద్దా మీకంటె పరేసరిగాని పనివాండ్లకైనా భయముండకపోతే ఇక బాగనే" విసుక్కుంటూ అన్నాను

"రెండు రూపాయల బత్తాయిలు అయిదు రూపాయల మామిడిపండ్లు తీసికొని రా" అని డ్రైవరు చేతిలో రూపాయలు పడవేసి భోజనంపై కూర్చున్నాను

డ్రైవరు వెళ్లిపోయాడు

"ఈ ఎండలో పండ్లకు పంపకపోతే ఏమి మునిగింది? తల్లికి బాగులేక పోతా వన్నవాడిని పండ్లకు పంపడమా?" నా భర్త అన్నాడు

"మనిషన్నప్పుడు ఏవో జబ్బులు వస్తుంటాయ్ అంతమాత్రానికి ఆతనికంటె ఎక్కువ

దిగులు మీకేపట్టుకుండే ఆమాత్రం శ్రద్ధ ఇంటిమీద ఉండాలని నెత్తిననోరుపెట్టుకొని మొత్తుకొని మొత్తుకొని ఇదైపోతున్నాను ఇంతవరకు జరిగిందేమో జరిగింది ఇక ముందైనా సుఖపడ్డామంటే ఎప్పుడూ ఏవో వాదనలు కోపాలు, తాపాలేనాయ్ ఎన్ని ఉంటే ఏమి లాభం అనుభవించేరాతకూడా ఉండాలె' అంటూ అన్నంముద్ద నోట కందించాను .

ముఖ్యంగా ఏదో వాదన సాగుతూనే ఉంది

"సరే! ఇది ఎప్పుడూ ఉన్నదేకాని ఇవ్వాళ డ్రైవరుకు సెలవు దొరుకుతుందా లేదా? నాభర్త ఆలుగడ్డ ముక్క కొరుక్కుంటూ అడిగాడు

"అసలు ఈరోజు మీ పనులన్నింటికి సెలవు పెట్టిందామని ఆలోచించి మీరు ఎప్పుడు వస్తారా అని ఎదిరిచూస్తు కూర్చున్నాను అని ఓరకంట నాభర్తను చూచాను

"ఏమిటి కార్యక్రమం?" విడ్డూరంగా అంటూ నీళ్లపైపు వద్దకి వెళ్లాడు నాభర్త

ఇంతలో డ్రైవరు పండ్లు తేగానే వాటిని పరిశీలించి వాటి మంచిచెడ్డలను గురించి డ్రైవరు తెలివితక్కువతనం గురించి మాట్లాడడంతో ఓ అరగంట కాలం గడిచింది

"అమ్మా!' అని తిరిగి డ్రైవరన్నాడు

"నాకేమీ తెలియదు మీ అయ్యానే అడుక్కో' అంటూ పండ్లు పటపట కోయసాగాను

డ్రైవరు కదలకుండానే తల నేలకువేసి నిలుచున్నాడు

"ఇంతకూ నీవు తలపెట్టిన పనేందో తెలుపలే" అంటూ చేతులు తుడుచుకొని వచ్చి మామిడిపండు ముక్కను తీసి ఆమాంతంగా నోట్లో వేసుకొని 'భలే పండ్లు తెప్పించావు చాలా బాగున్నాయి," అని కుర్చీలో చేరగిలబడ్డాడు నా భర్త

"నేను మంచిగాలేవన్నందుకా ఈ మెచ్చుకోవడం" అని ఒకముక్కను నా నోట్లో వేసుకున్నాను నాభర్త అన్నట్లు పండ్లు బాగానే ఉన్నాయి కాని ముఖంముందట మెచ్చుకుంటే పనివాండ్లు చెడిపోతారనేనీతిని కాపాడాలని "చూడగానే అనుకున్నంత చెడ్డగా మాత్రం లేవు మొన్న శర్మగారింట్లో ఓ పండు తిన్నాను చెప్పడం శక్యంకాదు దాని రుచి శర్మగారు స్వయంగా ఎంతో శ్రద్ధతో బజారంతా తిరిగి తెస్తుంటారట" అన్నాను

డ్రైవరు "అయ్యా" అని నాభర్తవైపు దృష్టి మరల్చాడు

'ఫ్రూర్తిగా ఒకపూట రాకపోతే ఎట్లా సాయంత్రం అమ్మ ఎటన్నా పోవాల్నమకుంటున్నదేమో ఇంటికిపోయి మందూ అది ఏర్పాటుచేసి నాలుగున్నర, అయిదువరకే వచ్చేయి రాత్రికి పెందలాడే పోదువుగాని" అన్నాడు నా భర్త

పొద్దున్నే చాలా ఇదిగా ఉండె దొరా! ఇంటికి పోతేగాని ఎట్లున్నది తెలియదు వీలుంటే తప్పకుండా వస్తా నీళ్ల నములుతూ డ్రైవరన్నాడు

"ఏదో జ్వరం వచ్చింటుంది అంతమాత్రానికి ఇంట్లోనే కూర్చుని చేసేదేముంటుంది నీలేమిటి తప్పకుండా రావాలె అని ధ్వని తగ్గించి 'ఇంతకూ మావాండ్లనంటే ఏం లాభం మనకు తెలియుండాలె పనివాండ్లతో మెలిగే పద్ధతి" అని భర్తవైపు కొంటెగా చూచి పళ్లెంలోని ఆఖరు మామిడిపండు ముక్కను నోట్లో వేసుకొని చేయి కడుగుకొని ఇద్దరము లేచాము

డ్రైవరు నుద్దేశించి "సరే! ఇంటికైతే పోయి చూడు" అన్నాడు నా భర్త

దండం పెట్టి డ్రైవరు వెళ్లిపోయాడు

ఆఫీసు గుమాస్తా వచ్చి కాగితాలపై సంతకాలు తీసికొని వెళ్లిపోయాడు

మేము పడకగదిలో ప్రవేశించాము

కొంతసేపటికి, వంటమనిషి రాజయ్య మాట్లాడుతున్న గొణుగుడు వినిపించి "రాజయ్యా" అని పిలిచాను రాజయ్య "అమ్మా" అని పరుగెత్తుకుంటూ వచ్చి గది తలుపు పక్కకు నిలుచున్నాడు

గదిలో పలనుంచే "ఇవ్వాళ పండ్లు తెచ్చావా?" అన్నాను

"పోయేటప్పుడు అయ్యకు చెప్పినా నమ్మా"

"అంటే! ఎండ్లు ఉన్నది లేంది అయ్యకేంతెలుసు? నాకెందుకు చెప్పలేదు?'

"రేషన్ దుకాణం బందు అయితదని అయ్యతో చెప్పి తొందరగ వెళ్లిపోయిన ఇప్పుడు పండ్లు తెమ్మంటారా?" లోపించిన ధ్వనిలో అన్నాడు రాజయ్య

"డ్రైవరు పండ్లు తెచ్చిన సంగతి ఒంటమనిషి చెప్పలే నీకు ఎరుగనట్టు మాట్లాడడంకూడా నేర్చుకున్నావా? నీ రేషన్ సంగతి చూచుకున్నావుగాని పండ్లెవరు తెస్తారనుకున్నావు?"

రాజయ్య మాట్లాడలేదు

"సరే! పోయిపండ్లన్నీ నీళ్లలో వేసి మంచిగా కడుగు' అనగానే రాజయ్య వెళ్లిపోయాడు

"ఇదంతా మీ వాట్టుబడిన అలుసే కారణం" అంటూ ఒయ్యారంగా భర్త చెంపపై ఒక చిటుక వేశాను

కలతనిద్రలో నుండి కండ్లు తెరిచి పక్కకు మళ్లీ పడుకున్నాడు

* * *

అయిదున్నరకుకూడా డ్రైవరు రాలేదు. పబ్లిక్ గార్డెన్‌లో కొంతసేపు తిరిగి అక్కడినుండి సినిమాకు వెళ్లాలని అనుకున్నాను డ్రైవరు లేందే ఎట్లా? తన కేమి శ్రద్ధ లేనట్లు నా భర్త ఆఫీసు గదిలో కాగితాలు తిరగవేస్తున్నాడు

"ఏమండీ! యింకా డ్రైవరు రాలేదు ఆఫీసుగదిలో ఎవరు లేనిది చూచి మెల్లగా అన్నాను

"రాలేదా? తల్లి కెట్లాఉందో మరి సరే రేపాయె ఇంతలో మునిగిపోయే దేముం దని" కాగితాలు తిరగవేస్తూనే అన్నారు నా భర్త

"అను మీ కిష్టముంటేగా అతడు రావడానికి అంటూ విసుగుతో లోపలికి వెళ్ళిపోయాను

సైకిలుపై డ్రైవరుకొరకు రాజయ్యను పంపారు

సినిమా టైం అయిపోతున్నందుకు ఆవే దనతో అటూ ఇటూ పచారుచేసినాను ప్రయత్నం చేసిచూదామని తిరిగి ఆఫీసు గదికి వెళ్ళి "ఏమండీ! డ్రైవరు రాన ట్టున్నాడు మనమే వెళ్లుదాం పదండి" అన్నాను

అలసిపోయినట్లు ఉన్న నా భర్త "అట్లాగా! అని లేచి ఒళ్లు విరుచుకొని ఆవలింతతీసి "సరే పోదాం నాకుకూడా బద్ధకంగా ఉంది పోదాం పద నీవు తయా రైవచ్చేగా నా దెంతసేపులే" అని బట్టలు వేసుకోగానే రాజయ్య సైకిలుమిద అతి వడిగా వచ్చి "అమ్మా! పాపం డ్రైవరు తల్లి చచ్చింది డ్రైవరు ఒకడే ఏడు స్తున్నాడు" అని బెదిరి బెదిరి చూడ సాగాడు

"అరే! చచ్చిపోయిందా! పాపం సరే సైకిలు అక్కడబెట్టి వెనుక కూర్చో" అని నా భర్త మోటారు పోనిచ్చారు

"ఎప్పుడు చచ్చింది ఏరా?" నా భర్త రాజయ్యను ప్రశ్నించారు

"డ్రైవరు ఊర్నుంచి పోయేటాలకే చచ్చిందట పెండ్లాం ఒకడే ఏడుస్తు కూర్చున్నదట

నా ఒళ్లు జలదరించింది నేరస్థురాలివిగా భయంతో భర్తవైపు చూదాను

గంభీరంగా నా భర్త మోటారు తోలు తున్నారు సినిమాకు వెళ్ళేదారి దాటి పోతుంది కొంతదూరము పోయినతర్వాత మోటారు ఆపి, కిందికి దిగి ఓ సందులో బడి రాజయ్యను అనుసరిస్తూ పోతున్నాము కొంచెం వెళ్లాక ఓ చిన్న గుడిసెవంటి యింటిముందర కొందరు మూగిఉన్నారు గుడిసెలోనుండి ఎండిపోయిన గొంతుతో ఏడ్పుధ్వని వినవస్తున్నది

మమ్ముల చూడగానే అక్కడి జనం బెదిరి పక్కకు తొలిగారు కూర్చొనిఉన్న కొందరు లేచి నిలుచున్నారు డ్రైవరు ఉబ్బొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకొన ప్రయ త్నించి, మాముందరికి వచ్చి బోరున ఏడ్వ సాగాడు

అప్రయత్నంగా నాకు కండ్లల్లో నీళ్లు తిరిగాయి

కొంచెం ఏడుపు చల్లబడగానే "ఏమైనా డబ్బు అవసరంఉందా" సానుభూతిగా నా భర్త అడిగారు డ్రైవరును

సందిగ్ధవైఖరిలో నా భర్తవైపు చూచాడు.

నా కండ్లు తిరిగిపోయాయి దుమ్ము కొట్లాడుతున్న ఇల్లు మాసిన చౌక్కా రేగిన నెత్తితో ఎండిపోయిన కన్నీటి మరక లతో కొడుకు పొదబారి వేలాడుతున్న పొజాట్టు చూడ భయంకరంగా తోచింది డ్రైవరు తొడిగే బట్టలకు ఇంటివాలకానికి పొంతన లేదు పూర్తిగా విరుద్ధము

నా భర్త పదిరూపాయలవి మూడు నోట్లు డ్రైవరుచేతిలో పెట్టి రాజయ్యను సహాయంగా ఉండమని చెప్పి బయలు దేరారు నేను ఆలోచనలో లీనమై వారి ననుసరించాను

నేరుగా ఇంటికే చేరుకున్నాము

—(•)—

నా భర్త గంభీరంగా వెళ్లి ఆఫీసు గదిలో ఆలోచిస్తూ కూర్చున్నారు

"ఇప్పు డెవరూ రారుగా" అంటూనే నేనుకూడ ఆఫీసు గదిలోకి వెళ్లి ఓ కుర్చీపై కూర్చున్నాను

నా భర్త వింతగా నావైపు చూచి, ముఖం మార్చుకొని పక్కకు తిప్పుకున్నారు

"ఏమండీ అట్లున్నారు?" ప్రశ్నించాను,

"మన జీవితాలను తలచుకొని ఆనందం కలుగుతుంటె ఇంకెట్లుంటాము" కోపంగా అన్నారు

ఇప్పుడు మన జీవితాలనంగ తెందు కండి" తెలుసుకొందామని అడిగాను

"తల్లికి బాగు లేదని ప్రొద్దటినుంచి మొత్తుకొంటుంటే అదని ఇదని, పండ్లని, సినిమాలని ఏడ్పించి ఏడ్పించి విధిలేక వదిలిపెట్టాము ఉన్నొక్క కొడుకు దగ్గర లేకుంటే ఎంత విలపించిందో మునలిది చస్తూ అందుకు మనం కారణమంటావా కాదా? మనం మామిడిపండ్ల మంచిచెడ్డల మహిమను కీర్తిస్తున్నపుడే ఆ మునలిది ప్రాణాలొదిలుంటుంది' ముఖమంతా ఎర్రగాచేసికొని అన్నారు

"మనం కావాల్నని వద్దన్నామా నౌకరి అంటూ ఉన్నపుడు అదో ఇదో వనుం టుంది చెప్తుంటాం ఇందులో విపరీత మేముంది?' నా నిర్దోషిత్వాన్ని నిరూ పించాను

"చాల్లే ఊరుకో ఎప్పుడూ నీవొక గొప్ప దేవతగా మాట్లాడుతుంటావు నీ కెప్పుడూ విలాసాలు విహారాలుంటే చాలు, ఎవరు ఏమైనా పర్వాలేదు నరేగాని, లోప లికి పో ఎవరో వస్తున్నారు" అని గద్దిం చారు నా భర్త

ఆ గద్దింపుతో కలతచెందినట్టు నిద్రలో నుండి లేచి కూర్చున్నాను

# అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు

నండూరి రామకృష్ణమాచార్య

"అఖిలభారత సాహిత్య పరిషత్తు" త్వరలో ఏర్పడబోతోంది ఈ పరిషత్తు ఏనాడో ఏర్పడవలసింది ఈనాటికైనా కేంద్ర ప్రభుత్వం యీవిషయంలో పూనుకోడం యెంతో సంతోషం

భారతదేశంలో యెన్నో భాషలున్నై. భారతదేశ భాషా పరిశోధనలో (Linguistic Survey of India) సుమారు రెండువందల యిరవై దేశభాషలు ఉన్నట్లు "గ్రియర్సన్" తేల్చారు కాని ఈ భాషావైవిధ్యం సమిష్టి సంఖ్యాబలంబట్టి సాహిత్య సౌష్ఠవంబట్టి ముఖ్యంగా కొన్నిటినే ఏరుకోవచ్చు భారతదేశంలోని ముఖ్య భాషలన్నిటికీ నేటి ప్రత్యేకత ప్రాముఖ్యం వాటికున్నా అన్నింటికీ సాహిత్యంలో అలంకారసామగ్రిలో–సారస్వత సాంప్రదాయాలలో ఎన్నో సామ్యాలున్నై. సంస్కృత సాహిత్యం—భారత భాగవత, రామాయణాలు–పురాణాలు అలంకార శాస్త్రగ్రంథాలూ దేశభాషలన్నింటిలో ఉన్నవి

యావత్ భారతదేశానికి ఏకభాష (Lingua Franca) ఎంత అవసరమో అన్ని భాషలలో ఉండే ఏకత్వం-సన్నిహితబాంధవ్యం-భేదసామ్యాలు నిరూపించి అనేకత్వంలో ఏకత్వం వ్యష్టిలో సమిష్టి సాధించి భారతజాతి యైక్యత ప్రదర్శించడానికి అఖిలభారత సాహిత్య పరిషత్తు అవసరం భారతదేశంలో ఉన్న సాహితీపరులకందరకూ ఏకవేదిక లభించాలి అప్పుడు దేశభాషలలో ఉండే ప్రగతి ఉద్యమాలకు ఉత్సాహదోహదాలు లభిస్తై భారతజాతీయతలోని ఏకత్వం ప్రదర్శిత మౌతుంది భిన్నభాషలలో—భిన్నమతాలతో ఆసేతుహిమాచలం ఏకజాతిగా వర్ధిల్లిన భారతదేశంలో ఈ అఖిలభారత సాహిత్య పరిషత్తువల్ల యుగయుగాలనుండీ అంతర్వాహినిగా ప్రవహించే ఏకత్వం శీవప్రవంతిగా వేడుకూడ వెల్లివిరుస్తుంది

## అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు

కేంద్ర భారత సాహిత్య పరిషత్తుకు అనుబంధంగా దేశభాషా పరిషత్తులు వర్ధిల్లుతాయి భారతదేశంలో సంఖ్యాబలంబట్టి చూస్తే తెలుగుభాష ఈనాడు రెండవది మొదటిది హిందీ—సారస్వత దృష్టితో చూస్తే తెలుగు హిందీకంటె ప్రాచీనం ఆంధ్ర సాహిత్య చరిత్రకు సహస్రసంవత్సరాల వయస్సు ఇతిహాసాలు పురాణాలు మహాకావ్యాలు తెలుగులో ఏనాడో పుట్టాయి

హిందీ హిందూస్తానీ ఉర్దూలను ఒకేభాషగా పరిగణిస్తే సారస్వతం ఈమధ్యనే పుట్టినా భారతదేశంలో అధిక సంఖ్యాకులు ఆభాషే మాట్లాడుతున్నారు అందుచే హిందీ కేంద్రప్రభుత్వం గుర్తించిన జాతీయభాష అయినా అంతకంటె ప్రాచీనమునుండి సారస్వతాంకల తెలుగు కన్నడం తమిళం మలయాళంవంటి దక్షిణాది భాషల ప్రాముఖ్యంకూడా గుర్తించి ప్రభుత్వం వాటి ప్రత్యేకతకు సాహిత్యానికీ తగిన ప్రోత్సాహగౌరవాలు చూపించాలి లేకపోతే భారతజాతీయతకే ముప్పు వాటిల్లవచ్చు

తెలుగుదేశంలో తెలుగు భాషతోనే సాహిత్యపరిషత్తులు పుట్టాయి ఆ సాహిత్యపరిషత్తులలోనే తెలుగు సారస్వతం పుట్టింది నన్నయ మహాకవి "రాజమహేంద్ర కవీంద్ర సమాజ సురక్ష్మజ" అని రాజరాజనరేంద్రుణ్ణి సంబోధిస్తాడు అంతేకాదు

"పరమవివేక సౌంభవిభావిత సద్గుణ పుంజవారితో
త్కరరుచిరంబులై సకలగమ్య సుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావనపయఃపరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల ముదంబొనరంగొనియాడి వేడుకన్ "

అనినాడు రాజరాజనరేంద్రుని విందుకొలువులో సమావేశమైయున్న "అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు"కు ధన్యవాదమర్పించి నన్నయ *"తెలుంగునన్" మహాభారత సంహిత "జగద్ధితంబుగా" ఆరంభిం*చాడు అనాడు అందరికీ అందుబాటులోలేని పంచమవేదం తెనిగించి జగత్తుకు హితమాచరించాడు నన్నయ వేదతుల్యమైన భారతం తెలుగులో వ్రాయడం సనాతనులకు ధర్మమని తోచకపోయినా జగత్తునకు హితం కాబట్టి ఆనాటి సాహిత్య పరిషత్తు అంగీకరించింది

విశ్వఖ్యాతమైన భారతం తెలుగులో అవతరించింది ముద్రణాయంత్రాలులేని ఆరోజులలో నన్నయ భారతం వ్రాయించి ప్రచారం చేసింది నాటి సాహిత్య పరిషత్ సభ్యులు—రాజరాజనరేం ద్రునకు ముందునుంచీ చాళుక్య రాజులు ప్రజల భాషయైన తెలుగు నకు రాజపూజ్యత సభాగౌరవం కల్పించారు "మునుమార్గ కవిత లోకంబున వెలయగ దేశికవిత పుట్టించి తెనుంగును నిల్పి రంధ్ర విషయంబున" అని నన్నెచోడుడు చాళుక్యులను గురించి అన్నాడు అంతకుముందు సంస్కృత ప్రాకృతాలే రాజభాషలు తెలుగునకు సాహిత్యమర్యాద నిచ్చి కవీంద్ర సమాజాలకు కల్పవృక్షాలైనవారు చాళుక్యులు

తమిళంలో సంఘవాఙ్మయం మొదట ఒక మహాయుగంగా విస్తరిల్లింది ఈ సంఘవాఙ్మయం సాహిత్యపరిషత్తుల మధ్య వికసించింది శ్రీకృష్ణదేవరాయల కొలువుకూటం ఒక అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు మాత్రమేగాక దక్షిణభారత సాహిత్య పరిషత్తు అని చెప్పాలి అష్టదిగ్గజాలలో తెలుగు కన్నడ తమిళ కవులుండేవారు ఆ సాహితీసమరాంగణ చక్రవర్తి "దేశభాషలందు తెలుగు లెస్స" అని చాటాడు పూర్వకాలం రాజులు రారాజులు మంత్రులు సామంతులు మన్నీలు జమీందారులు కవులను పోషించారు ప్రపంచ సాహిత్య చరిత్రలో తెలుగుకవి పొందిన మర్యాద అద్వితీయం "హేమపాత్రాన్నాలు ఏకాంబరాలు కస్తూరి గంధపేండ్రాలు మత్తేభవాహనాలు అంభోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదులు అగ్రహారాలు" తెలుగు కవికి లభించాయి కాని అది ప్రాచీన చరిత్ర

నేటి స్వతంత్రభారతంలో ప్రజాస్వామికయుగం ఆరంభమైంది ప్రగతిశీలమైన ప్రతిఉద్యమానికీ కవులే వైతాళికులై ముందు ఉత్సాహం కల్పించేది ఇదివరలో ప్రభుత్వం జరిపిన రాజులు కవులను పోషిస్తే ఇప్పుడు ప్రభుత్వ యంత్రాన్ని నడిపే ప్రజలే కవులను ప్రోత్సహించాలి ఆధునాతన యుగంలోకూడ అన్ని దేశభాషలలోను ప్రజాసహకారంతో సాహిత్య పరిషత్తులు ఏర్పడ్డాయి 1 హిందీ సాహిత్య సమ్మేళన్ 2 తమిళ సాహిత్య కళగం 3 కన్నడ సాహిత్య పరిషత్తు 4 కేరళ సాహిత్య పరిషత్తు మొదలైనవి

భారతదేశంలోని ప్రముఖమైన పదునాల్గు దేశభాషలలో సమగ్ర సాహిత్య పరిషత్తు తెలుగుభాషకే లేదు ఇదివరకు తెలుగులో ఏర్పడి సాహిత్యసేవ చేసిన—చేస్తున్న సంస్థలున్నవి ఆంధ్రసాహిత్య పరిషత్ (కాకినాడ) రాయలసీమ సాహిత్యపరిషత్ నవ్యసాహిత్య పరిషత్ హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్ తెలుగు భాషాసమితి మొదలైనవి

ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఎన్నో పుస్తకాలు ప్రచురించింది పరిషత్ పత్రికకూడ నడిచింది వారి కృషి ప్రశంసనీయమైనదే కాని వారు తెలుగుదేశంలోని సాహితీపరులందరినీ ఏకోన్ముఖం చెయ్యలేకపోయారు వారు సనాతన సాహితీప్రియులు కావటంవల్ల గ్రాంథికాంధ్రాన్ని మాత్రమే స్వీకరించారు అందుచే నవ్యసాహిత్య పరిషత్తు ఏర్పడింది యువకులందరూ కలిసారు "ప్రతిభ"పత్రికను వెలువరించి చాలా కృషిచేశారు ప్రస్తుతం నవ్యసాహిత్య పరిషత్తు సమావేశాలు జరుగడంలేదు "ప్రతిభ" వెలువడటమూ లేదు హైదరాబాదులో ఉత్సాహాలైన యువకులు సాహితీపరులు ఆంధ్ర సారస్వత పరిషత్తును స్థాపించారు వారు ఇంతవరకు ఎంతో నిర్మాణ కృషి చేశారు వారి ప్రచురణలు దేశభాషా పండితుల విషయమై వారి ఆందోళన ఫలప్రదమైనవి హైదరాబాదులో మాతృభాషను విస్మరించి ఉర్దూను తెలుగు పిల్లలు అభ్యసించవలసి వచ్చింది ఉన్నతవిద్య ఆంగ్లంలో కాకుండా ఉర్దూద్వారా నేర్చుకోవలసి వచ్చింది దేశభాషలలో ఉన్నతవిద్య నేర్పటం ప్రశంసనీయమైనదని కొందరు రాజకీయ విద్వాంసులు వక్రనీతి ఉపన్యసించారు అన్నామలై విశ్వవిద్యాలయంలో ఉర్దూ బోధన భాష అయితే అది

కి స్నై ర

అక్కడివారికి ఎంత దేశభాష అవుతుందో ఉస్మానియాలో ఉర్దూ హిందీలు హైదరాబాదీయులకు అంతే అవుతాయి కేంద్రప్రభుత్వం ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని చేపట్టి హిందీ బోధనభాషగా ఉండే టట్టు నిర్వహించాలనుకున్నప్పుడు హైదరాబాదాంధ్ర సారస్వత పరిషత్తువారు తీవ్రమైన ఆందోళనచేసి ప్రతిఘటించి నిల్పగలిగారు వీరికి స్థానికప్రభుత్వ సహాయంకూడా లభిస్తున్నది అయితే హైదరాబాద్‌లో మాత్రమే వీరిసేవ చేస్తున్నారు అయినా విశాలాంధ్ర నిర్మాణంలో ఈ పరిషత్కార్య వర్గంకూడా సుముఖులు కావడం సంతోషం

యావదాంధ్రదేశానికీ ఏకైక సాహిత్యపరిషత్తు ఆంధ్ర రాష్ట్రావతరణ మహోదయంలో ఉదయించాలి అది విశాలాంధ్రకు నాంది కాగలదు ఇతర దేశాలలో యిట్టి సాహిత్యపరిషత్తులు సేవ చేస్తున్నాయి ఫ్రాన్సులో మూడు శతాబ్దులనుండి సాహిత్యపరిషత్తు పనిచేస్తున్నది ఇంగ్లండులోకూడా సాహిత్యపరిషత్తు ఆవిర్భవించి ఈ శతాబ్దారంభంలోనే ప్రభుత్వాదరణ పొంది వర్ధిల్లింది

ఈ పరిషత్తులకు సహాయం ఉండాలికాని ప్రభుత్వాజోక్యం పనికిరాదు ఇవి ప్రజాసంస్థలుగానే ఉండాలి ప్రభుత్వం పెత్తనం వహిస్తే మునిసిపల్ పార్కులవలె ఏదోఒక ఎత్తుకు ఎదుగుతాయి కాని సహజస్ఫూర్తితో సారస్వత సంస్థలు విజృంభింపలేవు అందుచే తెలుగు భాషాసమితివలె ప్రభుత్వసహాయం పొంది ఏదో పరిమిత ప్రయోజనంకోసంకాక రాజకీయాల కతీతమై అందరి మన్ననలకు పాత్రమై ప్రజాహితంకోసం సర్వతోముఖంగా వికసించే సంస్థ ఏర్పడాలి

అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు ఆంధ్ర సాహిత్యపరిషత్తు వంటి సనాతన సాహితీప్రియులకు నవ్యసాహిత్య పరిషత్తువంటి నవసాహితీప్రియులకు హైదరాబాద్-రాయలసీమలలోని సాహితీపరులకు రాష్ట్రేతరాంధ్రులకు అందరకు ప్రాతినిధ్యం వహించే ఏకైక పరిషత్తుగా ఏర్పడాలి సాహిత్యంలోనైనా బహునాయకత్వం ఆరంభశూరత్వం విస్మరించి రాజకీయాలు మరచి ఆంధ్రులందరూ ఏకం కావాలి ఈమధ్య వికసించిన అభ్యుదయ రచయితలుకూడా ఇందులో చేరాలి సాహిత్యంలో రాజకీయాలు లేవు ప్రాంతీయత లేదు "దేశభాషలందు తెలుగు లెస్స" అన్న శ్రీ కృష్ణదేవరాయల్ని ఆంధ్ర కవితాపితామహుడు అల్లసాని పెద్దనను అష్టదిగ్గజాలను కన్న రాయలసీమలో మాతృభాష ఆంధ్రభాష కాదా ? భాగవతం పుట్టినచోటు భారతం విన్నచోటు ఓరుగల్లు రామాయణం కాకతీయ దండనాథుడు సాహిణిమారునికి అంకితం—ఆంధ్ర మహాభారతం మహాభాగవతం రామాయణాలకి కారణమైన హైదరాబాదు రాష్ట్రంలో మాతృభాష ఆంధ్రభాష కాదా? ఢిల్లీలోనున్నా బొంబాయిలోఉన్నా తెలుగువారు తెలుగువారే శ్రీనాథుడు చెప్పినట్లు "చీకటియున్ కళింగమును చిల్కనరస్సు" వరకును తెలుగుదేశమే కదా ! ఆంధ్రరాష్ట్రంలో చేరలేకపోయినా !

అందరూ చేరి అచిరకాలంలో అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు నిర్మించడం అవశ్యకర్తవ్యం దేశభాష లన్నింటికి సమగ్ర సాహిత్య పరిషత్తులున్నై ఇంతవరకు తెలుగుభాషకు లేదు ఈమధ్య సాహితీపరులు, పశ్చిమ గోదావరిమండలం ఏలూరులో సమావేశమై అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు నేర్పరచాలని ఆహ్వాన సంఘాన్ని నిర్మించారు త్వరలో అఖిలాంధ్ర సాహిత్యపరిషత్సభలు జరపడానికి సన్నాహాలు జరుగుతున్నై ఆంధ్రులందరూ సహకరించి అచిరకాలంలో అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు రూపొందే టట్లు చూడాలని ప్రార్థన



—***—

# ఏరిన ముత్యాలు

## నవ్యాంధ్ర చిత్రకారులు

సంజీవదేవ్

నవ్యాంధ్ర చిత్రకళ నవ్యభారత చిత్రకళలోని ఒక వేగవంతమైన కెరటం. పోయిన శతాబ్దపు చివరిభాగంలో ఉద్భవించిన భారతీయ పునర్జాగృతిలో ఇదొక బలమైన ఉద్యమం. సంస్కృతికి సంబంధించిన అన్ని రంగాల్లోనూ విదేశీ (ప్రత్యేకం అప్పటి బ్రిటీష్) ప్రభావాన్ని వదిలించి దేశీయ సాంప్రదాయాలను పునర్జీవింపచేయాలనే ప్రబల ప్రయత్నంలో అంతర్భాగమైనదంటే జయమే అధిక పరిమాణంలో జరిగింది. అప్పటి భారతీయ జీవితపు ప్రతి రంగంలోను వంగదేశం ముందడుగులో వుండేది. అదేవిధంగా చిత్రకళారంగంలో కూడ వంగదేశం పురోగామిగా నిలిచింది.

హావెల్ అవనీంద్రులు చేసిన నవ్యభారత చిత్రకళయొక్క వెలుగులు ఒక్క వంగభూమిలో మాత్రమేకాక భారతదేశంలోని ప్రతి ప్రాంతం మీదికీ ప్రాకినయి. భారతదేశంలోకల్లా ఆంధ్రదేశం వెనుకటినుంచి వంగదేశీయ విధానాలను అధికంగా అనుకరిస్తూవచ్చింది. ఈ అనుకరణ వల్ల ఆంధ్ర సంస్కృతికి మేలు కలిగిందేకాని కీడు కలుగలేదనటానికి వ్యతిరేకమైన నిదర్శనాలేమీ లేవు. అయితే యీ నవ్యభారత చిత్రకళోద్యమంయొక్క మొదటిరోజుల్లో ఇతర ప్రాంతాల నుండి అవనీంద్రనాథ్ ఠాగూరువద్దకు కళాధ్యయనానికి వచ్చినంతగా ఆంధ్ర ప్రాంతంనుండి రాలేదు. అప్పటికి మొత్తం దక్షిణ ప్రాంతానికంతకూ మైసూరునుండి ఒక్క వెంకటప్ప మాత్రమే అవనీంద్రుని దగ్గర కళావిద్యార్థి. తరవాతకాలంలో క్రమేణా ఆంధ్ర యువకులు వంగదేశానికి ప్రవేశించి శాంతినికేతనానికి నడువటం మొదలుపెట్టారు. అందుకని ఆంధ్రుల్లో అవనీంద్రుని శిష్యబృందానికంటే నందలాల్ బోసుయొక్క శిష్యబృందం చాలా విరివి.

నవ్యాంధ్ర చిత్రకళలో ముఖ్యంగా మూడు సంప్రదాయాలు గోచరిస్తయి. ఒకటి అవనీంద్ర సాంప్రదాయం, రెండవది దామెర్ల రామారావు సంప్రదాయం, మూడవది దేవీ ప్రసాదరాయ చౌధరి సంప్రదాయం. మొదటిది కేవల భారతీయ పద్ధతిలో కొంత దూరప్రాచ్య ప్రభావం మిళితమై వుంటుంది. దీనికి సంబంధించినవారు స్వర్గీయ ఆనంద మోహన్ శాస్త్రి, అడవి బాపిరాజు, గుర్రం మల్లయ్య, వి ఆర్ చిత్రా మొదలయినవారు. ఇక రెండవ సంప్రదాయంవారు స్వర్గీయ దామెర్ల రామారావు, వరదా వెంకటరత్నం, భాష్యకార్ల సత్యవాణి మొదలయినవారు. వీరి సంప్రదాయం బొంబాయి కళాసంస్థల్లో పరిణతిచెందిన అటు పాశ్చాత్యం ఇటు ప్రాచ్యంకాని ఒక పద్ధతికి చెంది వుంటుంది. ఇక మూడవ సంప్రదాయంవారు మద్రాసు ప్రభుత్వ కళాసంస్థలో దేవీ ప్రసాదరాయ చౌధరి క్రింద తయారయినవారు. రాయచౌధరి నవ్య భారత చిత్రకళలో దిట్టయినప్పటికీ ఆయన పాశ్చాత్య చిత్రణ పద్ధతిలో సిద్ధహస్తుడు.

నేటిరోజున అవనీంద్రుని సంప్రదాయానికి దామెర్ల సంప్రదాయానికీ చెందిన చిత్రకారులు చాలావరకు నశించారు. ఈ రెండు చిత్రణ పద్ధతులుకూడ కొంతవరకు ఆంధ్రదేశంలో నేడు మరుగుపడిపోయినయి. నవ్యాంధ్ర చిత్రకళలో ఇప్పుడు బాగా జీవించివున్న సంప్రదాయం రాయచౌధరిదే. నేటి ఆంధ్రదేశంలో చిత్రరచనను అనుసరిస్తున్న నవ యువ చిత్రకారులంతా దాదాపు రాయచౌధరి శిష్యవర్గమే. అయితే వీరంతా రాయచౌధరి శైలినే అనుసరిస్తున్నారని చెప్పటానికి వీలులేదు. ఎవరెవరి ప్రత్యేక ప్రతిభ ననుసరించి వారివారి స్వంత శైలిని సృష్టించుకొన్నారు.

—నగారా (అక్టోబరు 58)

## నవ్యాంధ్ర సాహితీ నవనవోన్మేషప్రగతి

ఆదంట జానకిరామ్

ముప్పది ఏండ్ల క్రితము ఒకనాటి ఉదయము అందరు వీధులలో ఈ వింత కేక వినవచ్చింది. "రండి కవులారా రండి కొత్తగా కవిత్వము రాయాలని ఆశించేవారంతా యిటు రండి యిటు"

"ఇదేదో కొత్త కేక అయినా వెళ్లి చూద్దాం" అనుకుంటూ నిమిషంలో అతనిచుట్టూ మూగారు "ఏవీ! నువు తెచ్చిన వస్తువులు చూపు!" అని ఆత్రుతతో అడిగారు

ఇదిగో ఇది తీయని గండుకోయిల గానము ఇది కుందనపు తళుకు ఇది కలువరేకులలోని మార్దవం ఇవిగో! ఇవి కమ్మతెమ్మెరలు

ఇది వెన్నెల ఇది ఎర్రకర్పూరపు కావి. ఇవి మంచి ముత్యాలు లక్ష పూవులలోని అపూర్వమైన తేనె ఇదీ" అంటూ ఉత్సాహముతో ఒక్కొక్క కవితావస్తువు చూపాడు ఆ బేహారి. గుంపులోనివారు వికటంగా నవ్వారు

బేహారికి తగని చిరాకేసింది వారిని దూరంగా పొమ్మంటూ ఇలా అన్నాడు:

బాబు! బాబు బాబూ బాబు! ఈ వస్తువులు తాకవద్దు ఇవి మీకోసం కాదు!"

కవితా లతాంగికి గర్భభూషణమైన
కలువ మీ చేతిని నలిగిపోవు
ఈవలి గాలి మీ మ్మువహించిన దవళ్యాం
శీమవె కాని సౌఖ్య మిదదు

— శ్రీ న్నె శ

తీయని యీ గండుగోయిల గానమ్ము
వెగటాయె నొర మీ వీనుగవకు
మీ కృతికన్యలకే కుందనపు దుక్కి వగలు
కై సేయు పుణ్యమ్ము గలదె
ఈ తుషారకణమ్ము మీ చేత లంటి
మలినమైపోయె. కొనకున్న మానె పొందు
సుకవి భోగ్యము లివటి వస్తువులు వీని
నంపివేయుడు దయ నిటు కలిగెనేని

ఇది కాటూరి వెంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతకవి 1928 ప్రాంతాన అల్లిన ఊహాచిత్రం. ఈ ముప్పది ఏళ్ళలో కవిత్వంలో ప్రాధమాన కల్పన పోయి దక్కిన భావప్రాధాన్యమేర్పడింది. జీవితంలోని విలువలు తెలుసుకోవాలనే ఆరాటం, ఆత్మపరిశోధన, ఉన్నత లక్ష్యం కోసం అన్వేషణ సాగినవి. కలువపూరేకు మెత్తదనము సాక్షాత్కరించింది. కొందరు కవికుమారుల రచనలలో "తిరిగి ఈనాటికి తెలుగు సాహిత్యానికి వసంతోదయమైంద"ని హర్షించారు భాషాప్రియులు. కాని, నిన్నంటే నిన్న ప్రధాన న్యాయమూర్తి రాజమన్నారు—ఆయనా కవి, రచయిత, విమర్శకుడు— తన సాహిత్య పరిషత్తులో ఇలా అన్నారు:

"ఇటీవల కవిత్వంలో కవి దృక్పథం మారింది. మెత్తదనము తియ్యదనము తగ్గిపోతోంది. కఠినత్వం, కర్కశత్వం ఎక్కువౌతూంది. నవ కవనానికి ఏమి కావాలో శ్రీశ్రీ చెప్పింది గుర్తుచేస్తున్నారు యువకవులు.

"సిందూరం రక్తచందనం బంధూకం
సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురూ ఎగరేసిన ఎర్రని
జెండా
రుద్రాలిక నయన జ్వాలిక కలకత్తా
కాళిక నాలిక
కావాలోయ్ నవ కవనానికి"

అందరు పేటలోని ఆ లేహారి చూపిన కలువ పూరేకు మెత్తమ్ములలోని మెత్తదనమునకు బదులు "రుద్రాలిక నయనజ్వాలిక, తుషారకణముకు బదులు పులిచంపిన లేడి నెత్తురు"

ఈ మార్పు తాత్కాలికము. తిరిగి సున్నితమైన కవిత్వం బయలుదేరుతుంది శ్రీశ్రీయే వ్రాస్తాడు అంటారు ఆశావాదులు. ఏమో!

ఆంధ్ర సాహిత్య చరిత్రలో అతిముఖ్యమైనవి రెండు విశేషాలు జరిగాయి. క్రిందటేడు ఒకటి, పాలగుమ్మి పద్మరాజు రచించిన "గాలివాన" అనే కథానిక ప్రపంచ బహుమతిని పొందడం. తద్వారా తెలుగుకు ప్రపంచ సాహిత్యంలో స్థానం కలిగింది.

రెండవది, సాహితీ సమితి అధ్యక్షులు శ్రీ శివశంకరస్వామివారి షష్ఠిపూర్తి మహోత్సవం.

మూడు తరాలక్రితం శ్రీ శివశంకర శాస్త్రి త్రోవచూపగా నవ్యసాహిత్య చైతన్యానికి కారకులైనారు పదారుగురు కవిమిత్రులు. కలిసి దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, వేదుల సత్యనారాయణ శాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, నాయని సుబ్బారావు, చింతా దీక్షితులు, మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, నండూరి వేంకట సుబ్బారావు ఇంకా కొందరు. సమితి తరఫున "సాహితి" అనే పత్రికకూడా సాగేది. వీరి కథానికలూ పద్యాలూ నాటికలు ఉత్తమ హాస్యరచనలు తెలుగుభాషను అందంగా అలంకరించాయి. ఇటువంటి భాషాప్రియుల కృషికి కారణభూతుడైన శివశంకర స్వామివారి షష్ఠిపూర్తి వేడుక మన భాషాస్థితిని గురించి విమర్శించడానికి తగిన అవకాశమిచ్చింది.

1915 ఆ ప్రాంతాల గురజాడ అప్పారావు గారు తమ కొత్తరకపు రచనలద్వారా ఉపన్యాసాలద్వారా కొయ్యబొమ్మైపోవచ్చిన మన భాషను కోమలిగా మార్చ యత్నించారు. వారి "కన్యాశుల్కం" మన వాడుకభాషలో వున్న జీవత్వాన్ని వ్యక్తపరచింది. ఆయన ముత్యాల సరాలు భాష అందుకోగల ఉన్నత శిఖరాలను సూచించాయి. ఆయన పెట్టిన ఒరవడే భాషాప్రియులైన యువకవులు అనుసరించారు.

ఆ రోజుల్లోనే రవీంద్రుని శాంతినికేతనంలో శిక్షపొంది స్వదేశం వచ్చారు రాయప్రోలు సుబ్బారావుగారు. గురుదేవుల సమక్షంలో తమకు లభించిన ఉన్నత భావాలను నవ్యరీతులను మన భాషకు అందజేశారు సుబ్బారావుగారు. అదివరకు ఖండకావ్యాలు చాలా తక్కువ. వీరు రచించిన "తృణకంకణము" "కష్టకమల" వంటి రచనలలో తెలుగుతనము ప్రతిబింబించింది. ఇంగ్లీషులో "లిరికల్ ఎలిమెంట్" అనే కవితారస్ఫూర్తి మూర్తీభవించింది. అంతేగాక ఆంధ్ర ప్రశస్తిని వర్ణించే వీరి పద్యాలు తెలుగువారికి తమ స్వంత సంస్కృతి అంటే ఇదివరకు లేని గొప్ప అభిమానాన్ని కలుగజేశాయి. తెలుగు మాటలు ఎంత కోమలంగా ఉంటాయో కవి సున్నితభావాలు ఎంత ఆర్ద్రత కలిగించగలవో తృణకంకణములో చూపించారు శ్రీ సుబ్బారావుగారు. పారశీక భాషలోని ఉమార్ ఖయ్యాం రుబాయతులను రమ్యంగా తెలుగుచేశారు.

—ఆంధ్రప్రభ (అక్టోబరు 1, 58)

## తేనెసోనల జానుతెనుగు

గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

ప్రతి సాహిత్యం ప్రథమంలో పదాలు, పాటలతోనే ప్రారంభమైంది. ఇవే బాల్యపు వాహినులను పోషించి సెలయేళ్లై ఈ ప్రవాహం తులదుండే సాహిత్య సాగరాలు సమృద్ధిగాంచినవి.

జనపదం అంటే పల్లెటూరు. జానపదసాహిత్యమంటే పల్లెటూళ్ళల్లో అనుశ్రుతంగా ప్రచారమై యుండే సాహిత్యం. దీని విశిష్టత ఏమిటంటే ఇది ప్రజలలో వ్యాప్తినొందుటే కాక తెలియకుండానే వారికి ఆనందం కలిగించాలి. తరతరాల నుండి పారంపర్యంగా వుండిన సొత్తువలెనుండి సూక్తిగా తోచాలి.

వీటిని మనవారు మధురకవిత అన్నారు. నిజంగా అట్టి మాధుర్యమే లేకపోతే వేలాది సంవత్సరాలనుండి ప్రజల నాలుకలపై నృత్యం చేస్తూ ప్రచారం పొందే ప్రభావం ఎలా కలుగుతుంది?

ద్విపదలోనే ఎక్కువగా పాట లుండేదివి. కన్నడులకు త్రిపద ఎట్టిదో ఆంధ్రులకు ద్విపద అట్టిది. ఆంధ్రజాతి జీవితమంతా [illegible] కవిత్వంలో ప్రతిబింబించింది. ద్విపదలోనే ఎక్కువగా పాటలుండేదివి. రగడలు, అక్కరలు, మంజరులు కూడా పాటలకు వాడిరి. నన్నయకు పూర్వం తెలుగులో నవకవిత విశేషంగా ఉండెను. నన్నయ భారతంతో వాటికి నిరాదరణ కలిగెను.

అసలు ఆంధ్ర సాహిత్య ప్రవంతి రెండు పాయలుగా ప్రవహించినది. మార్గకవిత, దేశికవిత.

మార్గకవిత సంస్కృత సంస్కారసహితమై, రాజాశ్రయమై పండిత రంజకత్వంకొరకు ప్రవర్తిల్లినది.

దేశికవిత ప్రజాశ్రయమై జనసామాన్య విజ్ఞాన వినోదములకుపయోగపడినది. మార్గకవితలోని శబ్దాడంబరము దూరాన్వయము లేకపోవుటయే గాక తేనెసోనె లొలుకుచు సాగుకొనుటకు, పర

ప్రకాశ్యము పొందుటకు ఆవిర్భవించినదే దేశ కవిత

ఈ దేశకవితకు సంబంధించినదే జానపద సాహిత్యం ఈ జానపద సాహిత్యాన్ని లాక్షణికులు, పండితులు, అనాదృత వాఙ్మయ మన్నారూ పద్య ప్రబంధములలోకంటె ఈ జానపద సాహిత్యములోనే అధికంగా రసము కలదని రసజ్ఞుల ప్రశంస

ఈ జానపద సాహిత్యం జంగం కథలు మద్దులు ఏలపాటలు బుమ్మెద పాటలు స్త్రీల పాటలు, పిల్లల పాటలు మొదలైన పేర్లతో ప్రచారంలో మున్నది

—ఆంధ్రప్రభ (అక్టోబరు 1, 58)

## తెలుగుజాతి కన్ను తెరపించిన కమనీయ చరిత్రులు

### విద్వాన్ విశ్వం

ఒకొక్క తరుణంలో ఒకొక్క జాతిని చిమ్మ చీకటి క్రమ్ముకుంటుంది అలసత్వం ఆవహిస్తుంది

ఒక్క ఊపుతో ఆ నిద్రిత జాతిని కదిపి మేల్కొలిపే నవచైతన్య మేదో ఒక్కుమ్మడిగా పొంగి పొరలుతుంది. ఆ జాతిని పచ్చతోరణం కట్టిన నవయుగ ప్రాంగణంలో ప్రవేశపెడుతుంది.

ఆ నవచైతన్య ప్రతినిధులుగా కొందరు మహాపురుషులు మేరువుల్లా నింగి యెత్తున యెదిగి నిల్చుంటారు

వారి క్రీనీడలో నవనవోన్మేషమైన ఆ జాతి సంస్కారం బహుముఖంగా విస్తరిస్తుంది

అలాంటి మహాదశలోనే 19 వ శతాబ్ది ఉత్తరార్థంలో తెలుగువారు వెలిగిపోయింది

ఆ యుగంలోనే దిగ్గజాలవంటి నవ్యాంధ్ర నిర్మాత లెందరో పుద్భవించారు.

### శ్రీ వీరేశలింగం

ఆ నవ్యాంధ్ర యుగ ప్రవర్తక మరకతమాలికలో కౌస్తుభమనగా శ్రీ కందుకూరి వీరేశలింగం గారు కనిపిస్తారు

అనాటి తెలుగుదేశం శవప్రాయమైన ఆచారాలకు అంకితమైపోయి ఉన్నది. అంధ విశ్వాసాలకు అటపట్టుగా ఉన్నది

ఆత్మప్రత్యయం లేక అనాథశిశువులా పడివున్న ఆంధ్ర ప్రజకు ఊపిరి పోసి, ఉత్సాహం కల్పించి ఉన్నత పథాలవేపు నడిపించే బాధ్యత వీరిపై బడినది వీరేశలింగంగారు ఆ బాధ్యత నెంతో ఆనందంతో స్వీకరించి ఆంధ్రౌన్నత్య నిర్మాణంలో నిమగ్నులైనారు

కాను ఆయన కేవలం మొక్క వ్యక్తిమాత్రుడు కాదు—ఆయన ఒక మహోద్యమం అనాటి జాతీయ వికాస మహాయాగాని కాయన అధ్వర్యం వహించారు

అప్పుడప్పుడే పడమటి గాలి బలంగా వీచి తెలుగునేల బీటలు వాటిపోయినది. పాత నమ్మకాలు కొన్ని సడలినవి నిబద్ధతలతో అడ్డగీతలతో ఎన్నాళ్ళన్నమై ఉన్న మన సమాజ వ్యవస్థ పునాదులలో బీరు దిగినది

సంఘంలో స్త్రీ కున్న కావు అట్టడుగుకు వెళ్లిపోయినది చదువు సాములు చట్టుబండలైనవి

అవిద్యలో అజ్ఞానంలో మునిగిఉన్న జనసంతానం విరాశాంకితులై నింగివేపు చూస్తున్నారు

సాహిత్య సంస్కృతులు చల్లబడిపోయి పరవడుల దిద్దుకొనడంతోనే సంతృప్తి పడుతున్నవి.

ఇదంతా చూచిన వీరేశలింగంగారు సంఘంలోని మూఢ విశ్వాసాలను కుళ్లగించివేసి, తిరిగి మనుషులలో ఆత్మవిశ్వాసం కల్పిస్తే తప్ప విముక్తి లేదని తెలుసుకున్నారు

అందుకు బద్ధకంకణులై ఆయన చరితార్థులైనారు

"దేశాభివృద్ధి కలుగుటకయి విద్యావిషయమును, వ్యవహార విషయమునను, ఆచార విషయమునను, నీతి విషయమునను, మత విషయమునను నానాముఖముల కృషి చేయవలయుననియే కాని యొక్క రాజ్యాంగ విషయములందే పనిచేయుట నా యుద్దేశముకాదు" అని శ్రీ వీరేశలింగంగారు తమ "వివేకవర్ధని" ఆశయములను వివరిస్తూ వ్రాసుకొన్నారు

అప్పటి సంఘంలో తన ఆశయముల నెరవేర్చుకొనుట కాయన అధిగమించవలసిన అటంకాలు ఒకటీ రెండూ కావు.

ఆయన మాటలలోనే:

"లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు గోపము; వేశ్యాంగనా సంగమము తగదన్న శృంగార నాయకులకు గోపము; పూర్వాచారము మార్చుకోవలెనన్న పామరజనులకు గోపము; నీతిబాహ్య వేషములు మత విరుద్ధములన్న ఆచార్య పురుషులకు గోపము"

అయినా ఆయన వెనుకంజ వేయలేదు

ఏదుప్రవృత్తిని కుదముట్టించుటలోను లంచగొండుల అట కట్టించుటలోను ఆయన జగజెట్టి వివేకవర్ధని హాస్య సంజీవని పత్రికల నాయన యిందుకే వినియోగించారు

ప్రత్యర్థుల గుండెలలో బాకుపోటులనే తన హాస్యరచనలకు పదును పెట్టుకొన్నారు మహోత్తమ ప్రయోజన సాధనకోసం సాహిత్యా న్నొక సునిశితాయుధంగా ఉపయోగించి కృతకృత్యులయ్యారు

కాని అంతతో ఆగలేదు

సాహిత్యంలో నాడు కనిపిస్తున్న స్తబ్దతను వదిల్చి వేయి రేకులతో విద్యాసరోరుహాన్ని వికసింపచేసిన భాగ్యంకూడా ఆయనకే దక్కినది

చరిత్రకూ సారస్వత విమర్శకూ ఆధారమైన కవుల చరిత్ర మొదలు జంతుస్వభావ చరిత్రదాకా ఆయన రచించారు

అంతేగాక భూగోళం పదార్థ వివేచకశాస్త్రం మీదకూడా పుస్తకాలు వ్రాయాలని కొంత పూర్తి చేసితివని ఆయన అసంతృప్తిని ప్రకటించుకొన్నారు

బాలకు కావలసిన హంగులను సులువుగా బోధించాలన్న ఉద్దేశంతోనే సంగ్రహ వ్యాకరణం, కావ్య సంగ్రహం అలంకార సంగ్రహం ఇలా రాసుకువెళ్ళారు

మరి రాజశేఖర చరిత్రవంటి నవలదాకా, శుద్ధాంధ్ర నిర్వచనోత్తర రామాయణందాకా రాస్తూనే ఉన్నారు

మరొకటి అన్నిటికంటె బాలవితంతువుల దుర్గతిని తొలగించాలని, అనాటి ముక్కుడి మూకతో పోరాడి ఎందరో అనాథలకో ఎమువు కుంకుమలను ప్రదానంచేశారు

ఒకచేమిటి తెలుగునేలలో తొలకరి చినుకులను కురిపించి వసంతోత్సవానికి మహాసంకల్పం చేశారు. నవ్యాంధ్ర పితామహులయ్యారు

—ఆంధ్రప్రభ (అక్టోబరు 1, 58)

## భారత జాతీయ సంస్కృతినిగురించి "అట్లాంటిక్ మంత్లీ" పత్రిక ప్రత్యేకానుబంధ ప్రచురణ

సుప్రసిద్ధ అమెరికన్ మాసపత్రిక "అట్లాంటిక్ మంత్లీ" అక్టోబరు నెల సంచికతోపాటుగా భారతదేశాన్ని గురించిన ఒక ప్రత్యేకానుబంధాన్ని ప్రకటిస్తున్నది "పెర్స్పెక్టివ్ ఆఫ్ ఇండియా" (భారతదేశ సమీక్ష) అనే పేరుతో ప్రకటించబడు తున్న ఈ 80 పేజీల అనుబంధ సంచిక అమెరికా పాఠకులకు భారత జాతీయ సంస్కృతిని పరిచయం కలిగించవలెననే ఆశయంతో తయారు చేయబడింది.

కవరు పేజీ ఎర్నెస్ట్ షాన్ చిత్రించిన ప్రధాని నెహ్రూ ఆయన సోదరి శ్రీమతి విజయలక్ష్మి పండిట్లు కలిసి ఉన్న చిత్రంతో ముద్రితంగా ఉన్నది. లోపల సుప్రసిద్ధ భారత రచయితలచే వ్రాయబడిన కథలు ఖండకావ్యాలు వ్యాసాలు భారతీయ చిత్రకళ నమూనాలు, ప్రపంచ రాజకీయాలలో భారతదేశ పాత్రను గురించి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ వ్రాసిన ఒక వ్యాసం. నార్మన్ విల్సన్ రాస్ భారత ఉప రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారితో జరిపిన అనేక సంభాషణల సమీక్ష ఉన్నవి

వీటితోపాటు భారతీయ ఎదనాలపు పట్టిక భారతదేశ చరిత్రలోని ముఖ్యఘట్టాల పట్టి భారత దేశ పటంకూడా ఈ అనుబంధంలో చేర్చబడినవి.

"అట్లాంటిక్ మంత్లీ" ఇతర దేశాల సంస్కృతులను గురించి అమెరికనులకు పరిచయం చేయ గల ఇట్టి అనుబంధాలను మరికొన్నింటినికూడా ప్రకటించదలచుకొన్నది వచ్చే వసంత ఋతువులో ఇలాగే జపాన్ను గురించిన అనుబంధం ప్రకటించబడుతుంది

భారతదేశాన్ని గురించిన ప్రస్తుత అనుబంధంలో—ముల్క్‌రాజ్ ఆనంద్ రాజారావ్ ఇక్బాల్ అహమ్మద్‌లు వ్రాసిన కథలు. ఎచ్ హెచ్ కె జోషి హుమాయూన్ కబీర్, బి లాల్, తంబిముత్తు, మేరీ ఎర్స్కైన్, బి రాజన్ శ్రీనివాస రాయప్రోల్, బుద్ధదేవబోస్, పయున్ తారా సహగల్ ఏ ఎస్ రెగే అమియ చక్రవర్తి వ్రాసిన ఖండకావ్యాలున్నవి.

ఇవిగాక డోనాల్డ్ థామస్, హెచ్ కె. మెహ్రా భారతీయ చలనచిత్ర పరిశ్రమను గురించి, ఆర్ కె నారాయణన్ భారతదేశ కథారచయితను గురించి కారల్ ఖండల్‌వాలా భారతీయ చిత్రకళను గురించి తంబిముత్తు భారతీయ కవితారీతులను గురించి, నారాయణ మీనన్ భారతీయ గాన కళను గురించి, నయన్ తారా భారత జాతీయాత్మను గురించి వ్రాసిన ప్రత్యేక వ్యాసాలుకూడా ఉన్నవి.

రవిక్ రావల్ సైలోజ్ ముఖర్జీ హెచ్ కె హెబ్బర్, జైమిని రాయ్ ఎస్ ఎస్ ఖేంద్రే, ఎమ్ ఎఫ్ హుస్సేన్ త్రిలోక్ కౌల్ అనిల్ రాయ్ చౌధరి రచించిన నాలుగు పేజీల త్రివర్ణ చిత్రాలు, ఆర్ మాంక్ చిత్రించిన రెండు పేజీల కథాకళీ నృత్యభంగిమలుకూడా ఈ అనుబంధంలో చేర్చబడినవి

ఈ అనుబంధ సంచిక ఉపోద్ఘాతంలో హార్వే బ్రీవ్ ఇలా వ్రాశారు "విరళరాష్ట్రాల విస్తృతంగా ఒక ప్రాతిపదిక సమస్యగా ఉన్న ఇండియావంటి దేశంలో విద్యావంతులందరు తమ దేశీయ జీవనంలో కీలకపాత్రను నిర్వహించవలసి ఉన్నది. ప్రజాభిప్రాయాన్ని రూపొందించడంలో వారికి అమిత ప్రాధాన్యం ఉన్నది కనుక వారిని నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు భారతీయ పాఠకులలో అభిప్రాయ వినిమయానికి అవకాశాలు కల్పించుకొని, సృజనాత్మక శక్తి ఎక్కడఉన్నా దానికి మనం విముఖులముకామనే సంగతి రుజువు చెయ్యడం మన కర్తవ్యం"

## కొండపల్లి కొయ్య బొమ్మలు

కామరాజు సత్యనారాయణవర్మ

కొండపల్లి విజయవాడకు 12 మైళ్ళ దూరమున గలదు ఈ గ్రామమందలి "కిల్లా" శ్రీకృష్ణదేవరాయల నాటినుండి అనేక చారిత్రక సంఘటనలకు రంగమై చరిత్రవిఖ్యాతి పొందినది ఈ కిల్లా ప్రాంతమందలి అడవులలో "పొణికి కఱ్ఱ" విస్తారముగా దొరకును ఇది బాడితకఱ్ఱ వలె తేలికగాను, అంతకన్నా మెత్తగాను యుండును ఈ కఱ్ఱ ప్రూను ఎండించి వాటిని చిన్న చిన్న ముక్కలుగా కోసి రూపములను చెక్కెదరు, తయారైన బొమ్మలకు సుద్దపూసి దానిపైన ఆ బొమ్మకు తగిన రంగులు వేయుదురు చేతితో స్వయముగా కట్టుకొన్న సన్నని కలముతో బొమ్మల రూపురేఖలను బహూమనోజ్ఞముగా వేయుదురు. ఈ బొమ్మలలో జంతువులు, పౌరాణిక విగ్రహములు, సామాజిక దృశ్యములు గ్రామీణ వృత్తుల భవనములు మున్నగునవి గలవు పల్లెటూరిజీవితమునందలి వివిధ వృత్తులకు సంబంధించిన బొమ్మలు సహజకళ ఉట్టిపడుచుండును. రామపంచాయతనము, దశావతారములు గోపికాకృష్ణుడు కమలమందలి లక్ష్మీ, సరస్వతులు, పాండురంగడు రాసక్రీడలు, కోలాటము మున్నగు పౌరాణిక విగ్రహములతో హైందవ కళయందు ఉండదగిన ఆదర్శభావము స్ఫురించుచుండును జంతువులలో ఏనుగంబారీ పూర్వకాలపు రాజుల ప్రాభవమును గుర్తునకు తెచ్చును తాటిచెట్టు కల్లుగీయుట మొదలగునవి చాలా ఆకర్షణీయకముగా నుండును మామిడి పండు, సీతాఫలము మున్నగువానిలోనుండి ఒక బొమ్మగాని పాముగాని పైకివచ్చుట చమత్కార శిల్పములలో పేర్కొనదగియుండును గుడులు, గోపురములు పాఠశాలలు, వసతిగృహములు రచ్చబావడులు మున్నగునవి బహూరమణీయముగా తయారుచేయుదురు Indian Institute Of Art In Industries తరఫున సుప్రసిద్ధ కళావిమర్శకులగు శ్రీ సుధాంశుకుమార రాయ్‌గారు ఈ కొండపల్లి కళాసంప్రదాయములను గురించి వ్రాయుచూ వీరి వర్ణరచనాపద్ధతి స్వతంత్రమైనదని, వీరి పరిశ్రమ పరాశ్రయ మెరుగనిదని వక్కాణించియున్నారు ఇంగిలీకము వీరిపందు జిగురు మున్నగు జిగురులనుండి రంగులను వీరే తయారుచేసికొనెదరు. కనుకనే ఈ రంగులు ఎన్నాళ్ళకు వాటికాంతి చెడకుండాయుండును ఇవిగాక చిత్రకళను కులవిద్యలుగా వీరిలో పనేక విద్యలు వర్ధిల్లినవి మహారాజుల భోజనములపై పరచెడి బహూసున్నితమైన "కుందనపురేఖ రేకు" గృహపరిశ్రమగా చేతితో తయారుచేసెడివారు చదురంగముతోపాటు మన తెనుగునాట ఒక అర్ధ శతాబ్దముక్రిందటివరకు ప్రచారంలోఉన్న "దశావతారి" అనే పేకను ప్రత్యేక నైపుణ్యముతో తయారుచేసెడివారు ఇన్నివిధముల శిల్పములు, చిత్రకళను కులవిద్యగా పఠించిన వీరిలో ఆర్థిక స్తోమతే లేక తగిన పోషణ ప్రోత్సాహము లేక ఈ విద్యలు నశించిపోవుచున్నవి.

—ఆంధ్రపత్రిక (అక్టోబరు 1, 58)

## ఒకే లిపి

మానికొండ సత్యనారాయణశాస్త్రి

లిపి ప్రాణరహితమగు సాధన మాత్రమేయని నా అభిప్రాయము పోకుండ రక్షించుకొనదగిన సంస్కృతి ఏదైనను ఉంటే అసలు భాషతో

ఉన్నదికాని లిపిలో లేదు. భాషను ఏ లిపిలో వ్రాస్తేనేమి? నిష్పాక్షిక దృష్టితో నిరహంకార బుద్ధితో చూస్తే మనము మన తెలుగు లిపిని వదలుకుంటే ఏమి కొంప మునుగుతుంది? ఫరవా లేదని నా యభిప్రాయము. అందుకని ఇండియా కంతకు ఒకే లిపి ఉంటే బాగు. దానిని ఎలాగూ దేవనాగరి లిపిగ మన రాజ్యాంగము నిర్ణయించే యున్నది కనుక, దానినే మనము అనుసరిద్దాము. మన చిన్నపిల్లలకు ఇప్పటినుండి అక్షరాభ్యాస మంతా దేవనాగరి లిపిలోనే కలిగిద్దాము. ఈ తెలుగు లిపి వాడకమును మానివేసి ఇంతటి నుండి మన నన్నయ తిక్కనాది కవిత్రయము వారి భారతము మొదలగు అన్ని గ్రంథాలను దేవనాగరి లిపిలో అచ్చువేయిద్దాము. మన ఎల్ల వ్యవహారపు వ్రాతలన్నీ ఆ దేవనాగరి లిపిలోనే వ్రాసుకుందాము. మన తెలుగు లిపిని ఇంతటి నుండి కేవలము మ్యూజియములో మాత్రము— ఒక పురావస్తు విశేషముగా ఉంచుదాము.

దేశానికి ఒకే సంస్కృతి దాదాపు ఒకే మూలభాష గలిగిన ఈ భారతదేశములో ఇన్ని లిపులు ఉండుటవల్ల మనలో ఏవో ఇన్ని భేదా లున్నట్లుగ ఇన్ని సంస్కృతు లున్నట్లుగ ఇన్ని భాష లున్నట్లుగ, కంగారుపడుచున్నాము. ఈ కంగారు కలిగించుచున్న కారణాలలో ఈ విభిన్న లిపు లొక ప్రబలకారణముగ నున్నది. జాతీయైక్యత కిదియొక అనవసరపు అడ్డంకిగ ఉన్నది. దీని నేల మనమిప్పుడు తొలగించుకొనరాదు? ఏనాడో ఏ కారణముచేతనో ఏర్పడిన ఈ నానారకపు లిపుల నీనాడు ఇంకను నిలిపియుంచు కొనుటకు న్యాయమైన సబబైన కారణమేమియు నాకు కనిపించదు—("పాతదాన్ని ఎల్లా వదలి పెట్టేది" అనే వెర్రిభ్రాంతి తప్ప) ఏదైన ప్రత్యేకపు ప్రయోజనంకూడ దీనివల్ల సాధించబడగలిగితే, ఈ లిపిని నిలుపుకొనుటకు నాకేమీ అభ్యంతరము లేదు. ప్రయోజనము లేకపోగా పైగా జాతీయైక్యత కిది అడ్డంకిగకూడ ఏర్పడియుండుటచేత, కించిత్తు హానికరమనికూడ నా అభిప్రాయము.

అయితే, కొంతమంది ఇంకొక మెట్టుకూడ పైకి ఎక్కవచ్చును. నేడు ప్రపంచమంతా ఒకే కుటుంబము కాబోవుచున్నదిగదా. కనుక ప్రపంచానికంతకు ఒకే లిపి బాగుండునుకూడ కొంద రనవచ్చును. ఈ వాదనయు నాకు పూర్తిగ అంగీకారమే. ప్రపంచములోని అన్ని లిపులను రద్దు పరచి, కేవలం యొక్క లిపినే వాడటముకూడ నాకు పూర్తిగ సమ్మతమే. ఆ లిపి ఏదంటే, నేటి ఇంగ్లీషు (రోమన్) లిపి అనికూడ నేను చెప్పడానికి జంకను. ఎందుకంటే నేడు ప్రపంచములోని బహుభాషలు (ఫ్రెంచి, రష్యన్ వగైరాలు) ఈ రోమన్ లిపిలోనే వ్రాయబడుచున్నవి. కనుక ఇండియా కంతకుకూడ ఈ ఒక్క రోమన్ లిపియే వాడినను నాకు సమ్మతమే. దేవనాగరి లిపిమీద నాకు ప్రత్యేకపు అభిమాన మేమియులేదు. అట్లే, ఇంగ్లీషు లిపిమీదకూడ ప్రత్యేకపు అభిమానముకాని ప్రత్యేకపు ద్వేషము కాని లేదు.

నేటి దేవనాగరి లిపిలో కొన్ని లోట్లు ఉన్నవి. అట్లే నేటి ఇంగ్లీషు లిపిలోకూడ లోట్లున్నవి. అయితే ఈ లోట్లను మనము సంస్కరించు కుందాము. అందులోవున్న 'తరుగు గుర్తులకు క్రొత్త గుర్తులను చేరుద్దాము. ఇట్టి సంస్కరణ లతో ఈ దేవనాగరి లిపినిగాని రోమన్ లిపిని కాని స్వీకరిద్దాము. తక్కిన లిపుల నన్నిటిని మ్యూజియములకు చేరుద్దాము. వాని చిత్రలేఖన సౌందర్యము (ఏదైనా వుంటే) దానిని భవిష్యత్సంతతులు చూచుకుంటూ ఉంటారు.

లిపులను మ్యూజియములకు చేర్చినట్లుగానే, భాషలనుకూడ రద్దుపరచి మ్యూజియములకు చేర్ప రాదా యని నన్నెవరైనా వాదింతురేమో! ఏమాత్రము సూక్ష్మముగ పరిశీలించినను, ఈ లిపులకు వర్తించిన ఆర్గ్యుమెంట్లు భాషలకు వర్తించ దని ఎంత మందబుద్ధిగలవాని కైనను స్పష్టము కాకమానదు.

పోకుండ రక్షించుకోదగిన సంపత్తి భాషలలో ఉన్నదికాని, లిపులలో లేదు. లిపులలో ఉన్న సంపత్తి రకరకముల చిత్రణము—భవిష్యత్సంతతుల వినోదముకొరకు మ్యూజియములలో భద్రపరచిన చాలును.

—వేంకట్రామా అండ్ కో వారి ఆంధ్ర రాష్ట్రావతరణ సంచిక (1-10-53)

చిన్న కథ

# గురివెందపూసల తావళం

సోమసుందర్

ఎందుకో చెప్పలేనుగాని, నేటి ఉదయం మంచి మనసులో దిగులుగా ఉంది. నా మనసేదో ప్రమాదాన్ని శంకిస్తోంది. అయితేమాత్రం నిత్యకృత్యాల్లో లోపం ఏముంటుంది గనక? మామూలుగానే భోజనంచేశాను. దిగులును జయించి దిగమింగడానికి మరికొంచెం ఎక్కువ తిన్నాననడంలో సందేహం ఉండదు. చేయికడుక్కొని తుడుచుకొంటూ నా డ్రాయింగు రూములోకి వచ్చాను. సిగరెట్టు ముట్టిస్తూ ఎందుకో బుర్ర పైకెత్తాను. గోడమీది నా ఫొటో నవ్వుతూ మౌనంగా హెచ్చరిస్తోంది. వీధి తలుపుదగ్గర ఎవరో పిలుస్తున్నారు. ఎవరు చెప్మా! ఈమధ్య అప్పులవాళ్ళ సతాయింపులతో నాలోకి నేనే ముడుచుకుపోతున్నాను. కూర్మావతారంలాగ బ్రతకడం నేర్చుకున్నానుకూడా! అందాకనే నా పేరేదైనప్పటికీ ప్రస్తుతం కూర్మావతారమనే పిలుచుకుంటున్నాను.

సరే తలుపుతీశాను. బ్రతికాను— అప్పులవాళ్లు కారు వచ్చినది—మిత్రుడు గంధం చక్రధరరావు. ఈమాటు కూర్మావతారం నిర్భయంగా తలెత్తుకోవచ్చు!

చక్రధరరావు విచిత్రమైన మనిషి. సన్నగా, నల్లగా మెరుస్తూ చిరుచెమటలు క్రక్కుతూ నల్లని ముఖంమీద దరహాస చంద్రిక లంటించుకుంటూ ప్రవేశించాడు. లోపలి కాహ్వానించాను. కుర్చీ చూపాను. "ఏం ఒంటరిగా వచ్చావ్?" అన్నాను. నా ఒంటరి అనే పదానికి అతనికిమాత్రమే అర్థం తెలుసు. మొన్న మొన్ననే కదా— ఎప్పుడూ అతనితో వచ్చే ఆర్టిస్టు ప్రభాకరం— చక్రధరం గురించి చక్కగా వివరించాడు! "వీడు ఎంత తెలివితక్కువ "వెధవో" అంత చక్కని ఆర్టిస్టు!" అని ఒక ఆర్టిస్టు యింకో వ్యక్తినిగురించి యింత స్పష్టమైన భాషలో చెప్పినప్పుడు ఆ అభిప్రాయాన్ని నేనెలా స్వీకరించకుండా ఉండగలను? ఇంతకీ నేనుమాత్రం అత నెలా మంచి ఆర్టిస్టయాడో చెప్పలేను. అందాకనే ప్రభాకరం చెప్పాడు. నేను కిమ్మనకుండా అంగీకరించాను అంతే!

చక్రధరరావూ నేనూ ఎదురెదురుగా కుర్చీల్లో కూలబడ్డాం. ఇంకా నవ్వుతూనే ఉన్నాడతను. నిజాని కా భావప్రకటనను చిరునవ్వు అని మాత్రమే అంటారు. పరీక్షగా చూస్తేనేగాని తెలియనేలేదు. ఆ చిరునగవులో ఎందాకనో వెలుగులేదు. ఎందుకో అలా నవ్వుతున్నాడు. మొదట్లో అతన్ని చూడగానే "దరహాస చంద్రికలు' అన్నాను అంటే—కారణం లేకపోయినప్పటికీ అతన్ని చూడగానే ఆ అందమైన సమాసం స్ఫురించడంవల్లనే అన్నానేమో! ఒకొక్క సమయంలో మనం తీవ్రమైన దుఃఖాన్నీ మనోవేదననీ దిగమింగుకుందుకు చిరునవ్వును ముఖానికి కప్పుకుంటాం! అందాకనే చక్రధరం ప్రదర్శిస్తున్నదలాంటి చిరునవ్వు మాత్రమేనేమో?

అతని రాకకు కారణం అడిగాను.

వెంటనే చక్రధరరావు ఆతురతతో జవాబిచ్చాడు. "మీకు జ్ఞాపకంలేదాండీ— మొన్న మీరు నాకు ఒక వస్తు విస్తానన్నారు కదా!" అన్నాడు.

అవును, జ్ఞాపకం వచ్చింది.

చక్రధరం విచిత్రమైన వ్యక్తి అన్నానంటే దానికి తగిన కారణాలు లేకపోలేదు! మనిషి సన్నగా పీలగావున్నా మంచి గుండెదిటవు గలవాడు. ఎంత పెంకితనం ఉందో అంత చొరవా లేదనడానికి వీల్లేదు.

అతన్ని గురించి నాకూ—నా గురించి అతనికీ చాలాకాలంనుంచి తెలుసున్నా స్నేహపూర్వకమైన పరిచయమైనది సరిగా పదిహేను రోజులక్రితమే! ఈమధ్య అతనిరూపంలో స్పష్టమైన మార్పువచ్చింది. ఎందుకో అన్నవరం వెళ్ళి ఏ పనీ తోచక పోవడంవల్ల ఎందుకేనా మంచిదని సత్యన్నారాయణమూర్తి సన్నిధానంలో తల తీయించుకొని శిరోజాలు భగవంతుడికి సమర్పించి వచ్చాడు. "మొక్కేమైనా ఉందా?" అంటే—"అదేం లేదండీ అలా బుద్ధిపుట్టింది" అంటాడు. మొత్తంమీద అతని మొహం బలే వికృతంగా తయారైంది. ఆ వికారాన్ని కప్పుకుందుకు బాగా ముదురు నీలంగుడ్డ టోపీ కుట్టించుకున్నాడు. అది ధరించి వీధుల్లోకి దర్జాగా రావడం మొదలుపెట్టాడు. ఆ ఆకారం నాకు చాలా వెగటుగా తోచింది. మామూలుగా టోపీలతో ఉంటే నాకేమీ అభ్యంతరం లేదుగాని ఆ టోపీని ధరించడంమాత్రం నేను భరించలేకపోయాను. ఆ రకం టోపీని చూడగానే బాపూజీ మరణం జ్ఞాపకంవచ్చి దుఃఖం ఆవరించడ మొక్కటే కారణం కాదు. నల్లని ముఖవర్ణంలో ఆ టోపీరంగు కలిసిపోయి చాలా అసహ్యంగా వికారంగా తయారైం దతని ఆకృతి. అందాకనే

అన్నాను "నాదగ్గరో యీ పెవింగ్ సెట్ ఉంది అడిస్తాను; ఉపయోగించుకుని తల వచ్చినతర్వాత తిరిగి యిచ్చేద్దువు గానిలే?" అని

అందుకోసం వచ్చా నీవేళ. మొన్న నాకో వస్తువిస్తానన్నారు కదా—అంటే జ్ఞాపకం రాకుండా ఉంటుందీ?—సరేనన్నాను కుర్చీలో కూర్చున్న మనిషి ఒక్కసారిగా నిట్టూర్చాడు.

"ఇంకా భోజనం చేయలేదు యిస్తే వెళ్లొస్తాను"

"ఎందువల్ల?"

"పదిగంటలనుంచీ స్టేషనుదగ్గర ఉండి పోయామండీ,

"కారణం"

"ఒక కంసాలి అమ్మాయి రైలుక్రింద పడి చచ్చిపోయింది అక్కడ చూస్తూ ఉండి పోయాం!" అన్నాడు

అత నా విషయాన్ని కేవలం నిర్లిప్తంగా మాటవరుసకి చెప్పినట్టుగా మాత్రమే వెలువరించాడు కాని ఆ మాటతోనే నేనెంతో షాక్ అయ్యాను "ఎవరూ? ఎందుకు?" అంటూ కంగారుగా ప్రశ్నలు వేశాను అతను వివరించడం ప్రారంభించాడు

"మావీధే లెండి కాంతం అంటారు ఆమె భర్త వెండిపని చేస్తాడు మంచి పనివాడే. యిక్కడే పెద్దబజారులో అతని కొట్టు ఆమెను మీరు చూసేఉంటారను కుంటా." అన్నా డతను

ఒక్కక్షణం ఆలోచించాను "మీరామెను చూసేఉంటారని" నొక్కివక్కాణించడం వల్లనో మరెందుచేతనో విపరీతమైన పశ్చాత్తాపం కలిగింది కారణం తెలియదు 'ఎలా ఉంటుందామె?' అన్నాను

"ఇరవై ఏళ్లుంటాయి అందంగానే ఉంటుంది నొక్కునొక్కుల తలా నల్లగా చామనచాయగా ఉంటుంది" అన్నాడు

ఇంతకీ కారణమేమిటో అతనింకా వివరించనేలేదు మళ్ళీ అడిగాను అతను

"ఆమె తల్లిదండ్రుల దీ ఊరే. భర్తదీ ఈ ఊరే ఆమె యిష్టానికి వ్యతిరేకంగా పెళ్లిచేశారు పైగా పెళ్లిజరిగినదగ్గర్నుంచీ కూడా ఆమెకి భర్తవల్ల సౌఖ్యంలేదు అందుకనే మావీధే ఒక అబ్బాయి ఎర్రగా ఉంటాడు అతనితో సంబంధం పెట్టుకుంది అద్దాల వెంకటరాయుడి అల్లుడండీ, సూర్రావు సోడాషాపుదగ్గర మేమంతా కూర్చునేవాళ్లం ఆ వెనకాలే ఈ అమ్మాయి తాటాకు యిల్లు ఎలా కలిసిందో మనకి తెలియదుగాని కొట్టు వెనకాలి పెరటిగుమ్మం తలుపుతీసి ఉంచేది వాడు ప్రతిరోజూ వెడుతుండేవాడు'

"సరే తర్వాతేం జరిగింది?" అడిగాను ఆదుర్దాగా

"అలాగే రామం ఆమె యింటికి వస్తూపోతూ ఉండేవాడు అతని కిష్టమైనదల్లా చేసిపెంపుతూండేది సరే తను లేకపోతే బ్రతకలేదని గ్రహించి ఆమె రమ్మన్నపుడల్లా ఏదో అవసరమనీ డబ్బుకావాలనీ డబ్బిస్తే వస్తాననీ కబురుచేసేవాడు పాపం, ఆమెకి డబ్బు ఎలా వస్తుందీ? వచ్చినపుడల్లా ఏదో బంగారపు వస్తువు వాడికిస్తూనే ఉండేది అన్నాడు చక్రధరం

అకస్మాత్తుగా నే నన్నాను "సన్నగా బక్కపల్చగా పొట్టిగా ఉంటుంది కదూ. పెద్ద కళ్లూ కొంచెం ఎత్తుపళ్లూ వుంటాయి అవునా?" అన్నాను ఏదో హఠాత్తుగా జ్ఞాపకంరావడమే కారణం.

"అచ్చే అంత సన్నగా వుండదండీ." అన్నా డతను తాపీగా

"అయితే ఎవరు చెప్మా? బంగారువస్తువులుకూడా యిచ్చేసిందన్నమాట. సరేలే తర్వాత?"

"రోజురోజుకీ ఆమె వంటిమీదున్న కొద్దిపాటి నగలూ హరించిపోతూవచ్చాయి రంకుతనం దొంగతనం ఎన్నాళ్లు దాగుతాయి చెప్పండి. క్రమేపీ మొగుడికి తెలిసిపోయింది వాడు నగలు ఏదో సమయానికి వచ్చి రెండు సెతుకులు కతికి కొట్టుదగ్గరకు పోయేవాడు రాత్రిళ్లు బొత్తిగా యింటి మొహం చూసేవాడుకాదు పైగా రోజూ వచ్చినపుడల్లా ఏదో వంకచూసుకొని ఆమెని బాదకొడుతుండేవాడు ఆమె అందరితోనూ చెప్పేది "తనకి జన్మలో సుఖంలేదనీ ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాననీ— నాతోనైతం ఆ విధంగానే చెప్పింది ఆ విధంగానే రెండుసార్లు నూతిలో పడింది అదేమిటో చెప్పలేను రెండుసార్లూ ఎవరో ఒకరు చూడ్డం పైకితీయడంతోనే సరిపోయింది మూడవసారి ఏదో నాటీ వల్ల మందూ మారుకు త్రాగిందట కాని ఆ దఫా కూడా ఫలితం పొందలేదు కారణం ముందుగానే అందరికీ తెలిసిపోయింది విరుగుడు పట్టేశారు మరోసారి ట్రెయిను క్రింద బుర్రపెడదామనే ఉద్దేశంతో రైలు వచ్చే సమయానికిముందే వెళ్లి పట్టాలకడ్డుగా పడున్నదట ఎవరోచూసి బైటికి లాగి రెండు తన్ని పంపేశారట ఈవేళ చేసిన ప్రయత్నం ఆఖరిది ఇంక మళ్లీ ప్రయత్నించాల్సిన అవసరంగాని ఏవో బాధ లనుభవించాల్సిన అవసరంగాని ఆమెకి లేదు' అన్నాడు చక్రధరం చిన్నగా పేలవంగా నవ్వాడు నేనుమాత్రం నవ్వేస్థితిలో లేను గోడమీది నా ఫొటో నవ్వుతోంది అతను మళ్లీ గుక్కమలుపుకున్నాడు "రైలు వస్తుంటే ప్రక్కప్రక్కగా నడిచిందట కాప్సెను గార్డు డ్రైవర్లు "దూరంగా ఉండు' అంటూ అరుస్తూనేఉన్నారట దూరంనుంచి పశువుల కుర్రాళ్లు చూస్తూనే ఉన్నారట గభాలున రైలు చక్రాలలో పడిపోయిందట పడుతున్నపుడు తల గర్డరుకు గుద్దుకోవడంవల్ల కపాలం పెంకు నుదుటి మీద పూర్తిగా బ్రద్దలైపోయి, మెదడు

బైటికి వచ్చేసింది చక్రంమీదినుంచి పోవడంతోటే మెడ నరాలన్నీ నలిగి తుత్తునియలైపోయాయి ఒక్క గొంతుముడి దగ్గర తప్పితే పట్టేలేదు తల వెనక్కిపోయింది అబ్బా! భయంతో చూడలేక మొహం తిరిగిపోయిందండీ'' అన్నాడు చక్రధరం

చక్రధరం చెప్పినది కల్పన కాదు కల్పించే శక్తి సామర్థ్యాలున్నవాడూ కాదు కేవలం యథార్థదృశ్యం! ఆ విషయమంతా చక్కగా సజీవంగా సాదృశ్యంగా వర్ణించి చెప్పడం నాయీ కథకోసంకూడా కాదు! నేను ఆ భీభత్స దృశ్యాన్ని చూసినప్పుడు మానవుడుగా పడ్డ దుఃఖంలో తోటివాణ్ణయిన నాకు పాలుపంచడం సహజంకాబట్టి మాత్రమే ఆకలివేస్తున్నా శ్రమతీసుకున్నాడు చక్రధరరావు! అంతకు తప్పితే మరేయితర స్వప్రయోజనమూ లేదు అతను ఆ గాథ ముగించేసరికి యించుమించు భిన్నుణ్ణయిపోయాను ఏదో తెలిని—అవ్యక్తవిషాదంతో నా హృదయం అపస్మారకమైంది అధోజగతికి చూడ్కులనిగిడ్చి—చేత్తో నుదుటిని గట్టిగా నొక్కుతూ-భారంగా ఆలోచనలు సాధిస్తున్నాను

నా పరిస్థితిని అతను కనిపెట్టేడో లేదో మాత్రం నేను చెప్పలేను అతను లేచి నుంచున్నాడు ఒళ్లు బద్ధకంగా విరుచుకున్నాడు "నాకు దాన్నిస్తారా?—వెళ్లొస్తాను!" అన్నాడు మామూలు విధేయతతో దానితో నా ఆలోచనా సమాధినుంచి తెప్పరిల్లాను లేచాను లోపలికి వెళ్లి నా ఫెల్టుహేటు తెచ్చి అతనికిచ్చాను గౌరవపుస్సరంగా తీసుకున్నాడు నా ఎదురుగా దాన్ని ధరించలేదు సిగ్గుపడ్డాడల్లే ఉంది చేత్తో పట్టుకొని వెళ్లిపోయాడు

నేను మళ్లీ నా యథాస్థానంలో కూలబడ్డాను తాగినవాడి మానసిక శూన్యత్వంతో భారంగా—ఆలోచనారహితంగా — అలాగే కూర్చున్నాను దేన్నిగురించి ఆలోచించలేని మానసిక నీరసం ఎందువల్లో నన్నావరించింది కాని బొత్తిగా ఆలోచించకపోనూ లేదు నా లోపలి పొరుగుల్లోదాంకొని—సమయాసమయా లెరుగకుండా అడపాదడపా వెలుపలికి ఉరికివచ్చే శ్రీయుతులూ శ్రీమతులూ అంతా ప్రత్యక్షమవనారంభించారు అదిగో వాడు రమాకాంతం! వెకిలిగా నవ్వుతున్నాడు "రామంగాడు చేసిన చీకటితప్పులవంటివి నేనెన్ని చేయలేదూ?" అంటున్నాడు అదిగో వాడు—గోపాలకృష్ణమూర్తి! నిజంగా సార్థకనాముడు!—"నీతి నియమాలు లేకుండా నేనెంత దుర్మార్గంగా బ్రతకలేదూ?" అంటున్నాడు వాడు— విశ్వనాథం! మహానుభావుడు!" మాతంగకన్యలనుంచి మహారాణులవరకూ ఎన్ని రకాల అనుభవాలు పొందానో ఎవరికి లెక్క?" అంటున్నారు ఈ ముగ్గురు పురుషోత్తములతోనూ రహస్యసంబంధాలు కలిగి ఉన్న సీత సావిత్రి సుశీల అహల్య శ్యామల, శారద వంటి పరదారలు— అందరూగాని లేదా కొందరుగాని శాంతం నడచిన మార్గాన్నే నడవాల్సివచ్చినపుడు ఈ మహాపురుషులంతా ఏమౌతారు? ఈ ఘోరమైన సాంఘిక నేరాలకు బాధ్యులెవరు? ఈరకమైన సజీవస్వప్నాలే పగటిపూట నాకు కలక్కపోలేదు

* * *

లోగడ తుఫానుతో భూమి కొంత చల్లబడినా మేనెల కావడంవల్ల ఎండలు పునహాతమ ప్రభావాన్ని చూపకపోవడంలేదు అందువల్లనే శరీరానికి శైత్యోపచారంగా సాయంత్రం మళ్లీ స్నానంచేసి నేను బయటికి బయల్దేరాను శుభ్రమైన బట్టలూ సువాసన తైలం ఎగైరా ఆత్మానందకరాలు ధరించినప్పటికి మామూలు కార్మాచారంలాగనే బయల్దేరాను అప్పటికే ఆరు కావడంవల్ల తిన్నగా పార్కులోనికే పోయాను ప్రతిమూలా జనం ఎవరిగొడవల్లో వారు నిమగ్నులై ఉన్నారు ఆ జనంలో నే నెరుగున్నవాళ్లూ—నన్నెరుగున్నవాళ్లూ పరిచయస్థులూ మిత్రులూ సన్నిహితులూ చాలామంది ఉన్నప్పటికీ ఏగుంపు దగ్గరకూ పోకుండా ఒకమూల సన్నని సిమెంటుబల్లమీద ఒంటరిగా కూర్చున్నాను ఎవరితోనూ మాట్లాడడానికి మనసు అంగీకరించటంలేదు కేవలం మౌనసమాధిలో కూర్మకవచవర్మికంతో అనిర్వచనీయమైన తపస్సే ఆధారంగా క్షణాలు దొర్లించుకుంటున్నాను

నిముషాలు గడుస్తూనే ఉన్నాయి ఆంధ్రులకు చిరకాల మిత్రంబులైన తుఫానులూ క్షామాలూ, కాటకాలు కనీసం మూడేళ్లకొకసారైనా మనదేశంపై విహారంచేస్తూనే ఉంటాయి ఈ ఈతిబాధ లనుభవించడమే ఆంధ్రుల ఏకైక జన్మహక్కు! అందాకనే లోగడ తుఫాను రాయలసీమ గోరుచుట్టుమీద ఎలాంటి రోకటిపోట్లు వేసిందో రేడియో—తనకు క్రొత్తగా అందిన సమాచారాన్ననుసరించి వివరించుతుంటే వినడానికి ఉబలాటం కలుగలేదు కేంద్రప్రభుత్వం తరఫున నూతన ఆర్థికశాఖామాత్యుల ప్రవేశపెట్టిన క్రొత్తబడ్జెట్టు ఘనతగురించి రేడియో కంఠం హుందాగా వివరిస్తోంది బహుశా వార్తలు చదువుతున్నది ఎన్నాల రంగనాథరావు కావచ్చు! అయినా వినడానికి నాకేమీ అభిలాష కలుగలేదు

"ఒరేయ్ - కూర్మం!" అంటూ నా వెనుకనుంచి ఎవరిదో చేయి నా భుజాన్ని తట్టింది ఆ చెయ్యి పట్టుకొని ముందుకులాగి జరిగి కూర్చోబెట్టాను ఇంకెవరు! మిత్రుడు విశ్వనాథం! ఆ కంఠంలోని నీరసాన్నిబట్టి—నడవడికలోని దైన్యతనుబట్టే ఏదో తప్పు చేసినవాడి ఎరికితనంతో బిరుసెక్కిపోయినట్టు కనిపిస్తున్నాడు

"ఏమిట్రా విశేషాలు?" అన్నాను. కొంచెం హుషారుగానే అన్నాను

"ఆఁ—ఏమున్నాయిలే కాని " అంటూ ఆగాడు మళ్లీ ఏమనుకున్నాడో— "ఈవేళ ఉదయం ఒక విచిత్రం జరిగింది తెలుసా? ఒక అందమైన అమ్మాయి రైలు క్రిందపడి మరణించింది" అన్నాడు

"ప్ప్! పెద్ద విచిత్రమేముందిలే! ఇలాంటివి నిత్యమూ జరుగుతూనే ఉంటాయి! నేటి స్వచలిత సమాజానికి బహిరంగంగా కనిపించే మహాశక్తిస్వరూపం మాత్రమే ఈ రైలు!' —అన్నాను

"అదా సరి! అసలు సంగతి వినకుండా మాటాడకుమరి కవిత్వం! అన్నాడు విశ్వనాథం

దానితో నాకు అనుమానం కలిగింది చక్రధరం చెప్పిన కొంతం కథ యింకా పూర్తి కాలేదన్నమాట! అనుకున్నాను అంచాతనే ఆదుర్దాగా అడిగాను "ఏమిటి చెప్పూ! కొంపతీసి ఈ కథతో దీనికేమైనా సంబంధం ఉందా ఏమిటి?

"నే చెప్పబోయేదదే! కంగారెందుకు? విను అసలీ మనిషిని ఏడాదిక్రితం చూశామరా! పెద్దబజారునుంచి మీయింటికి వచ్చే దారిలో సూరమ్మ యిల్లుంది చూశావూ— అక్కడ చూశాను ఆమెకూడా నావెంపు రెప్పవాల్చకుండా తదేకదృష్టితో చూసింది అమ్మాయి బాగానే ఉంది పైగా నేనంటే ఆకర్షణ కనబరుస్తోంది—ఇంకా కావలసిందేముంది? ఆ సూరమ్మ సంగతి నీకు తెలుసా? యిలాంటి వ్యవహారాల్లో కొంచెం సంధాన కార్యకలాపాలు సాగించగలదు అందాకనే మరునాడో ఎప్పుడో సూరమ్మ నడిగాను "ఇలా మీ యింటివద్ద కనిపిస్తూందే ఆ అమ్మాయి ఎవరు? ఏమిటి సంగతి—నన్ను గట్టిగా చూస్తోంది? ఏమైనా పని జరుగుతుందా వట్టి చూపులు గొడ్డేనా?" అని దానినడిగితే ఆమె "నాకది బంధువు ఈవిషయంలో నేనేమీ మాట్లాడకూడదు మరి! బావుండదు నువ్వే ప్రయత్నించుదాదూ!" అంది సరే వీలుకలిగినప్పుడల్లా చూస్తూఉండేవాణ్ని పెద్ద ప్రయత్నంకూడా ఏమీ చేయలేదు అయినా యిది ఏడాదిక్రితం సంగతి!" అన్నాడు విశ్వనాథం

"అయితే యిప్పటి సంగతేమిటి?" అన్నాను ఓరిమిపట్టలేక

విశ్వనాథం చెప్పడం ప్రారంభించాడు ఎందుకో మనిషి బాధపడుతున్నాడనేందుకు అతని గొంతుకే సాక్ష్యమిస్తోంది "ఆమెకి మొగుడివల్ల పిసమెత్తు సౌఖ్యమైనా లేదట అంచాతనే రామం అనే వాడితో సంబంధం పెట్టుకుంది ఆవిషయం నాకు నిన్నటివరకూ తెలియదనుకో! అటుమొన్న సాయంత్రం ఈశ్వరుడి గుళ్ళో హరికథ చెప్పినప్పుడు ఆమె అక్కడికి వచ్చింది నన్నుచూసి కళ్ళతో సంజ్ఞచేసింది వీధిలోకివచ్చి కిళ్లీ కొట్లో నిలబడ్డాను ఆమెగూడా వచ్చింది ఇద్దరం ఆ ప్రక్క గంతలోకి తప్పుకున్నాం కొంచెం సేపు అక్కడే ఏవో కబుర్లు చెప్పుకుంటూ గడిపాం "రేపు మధ్యాహ్నం రెండుగంటలకి తిన్నగా మాయింటికి వచ్చేయండి. వీధిలోనే ఉంటాను" అంది సరే, నిన్న ఆదివారం మధ్యాహ్నం ఆమె యింటికి వెళ్లాను నాకోసం అందంగా అలంకరించుకొని సిద్ధంగా కూర్చొనుంది వెళ్లీవెళ్లడంతోటే తలుపులువేసి ప్రక్కపై కూర్చోబెట్టింది "ముందు నా సంగతంతా వినండి" అంది తన వివాహంతాలూకు దుఃఖగాధను వివరించింది తరువాత రామం అనే ఆసామీతో తనకిగల సంబంధం గురించి చెప్పింది "నా ఒంటిమీదున్నదంతా వలిచి అడికిచ్చాను నన్ను నాశనంచేయడమే అడి ఉద్దేశమైతే నేనింకేం చేయను!—అంచాతనే మిమ్మల్ని నమ్మన్నాను ఏడాదినుంచీ మీరు నాకోసం తిరుగుతున్నారు మీయా అతని లాగ మారిపోరనే ధైర్యం ఉంది అయినా ఒట్టెయ్యండి!" అందామె తరువాత నా జన్మలో ఎరుగని ఆనందాన్ని చేకూర్చింది సరే—ఆమెనుంచి సెలవు తీసుకొని వచ్చేముందు "ఏదైనా మంచి చీర కొనుక్కో!" అంటూ పదిరూపాయల కాగితం చేతిలో పెట్టాను ససేమిరా పుచ్చుకోనంది ఏం చేయను? వచ్చేశాను " అన్నాడు విశ్వనాథం

నిజమే నాకు తెలుసుకదా ఒక్కొక్కసారు విశ్వనాథం చేతికి ఎముకే ఉండదు "ఇంతవరకూ బాగానేఉంది ఇప్పు డామె ఎందుకు ఆత్మహత్య చేసుకున్నట్టు?" అని ప్రశ్నించాను

"ఏమో! అదే నాకూ యిప్పటివరకూ తెలియలేదు "

"పోనీ ఆమెని నీతో వచ్చేయమనలేకపోయావా? వేరే కాపురం పెడుదువుకాదూ పోషించలేవు గనకనా?

"అస లంతవరకూ వచ్చిందేదోయ్! కథంతా మొదట్లోనే ఉందికదా. చచ్చిపోయేముందయినా నాకు కనిపించి విషయాలన్నీ చెబితే విశేషంలాగుండునే వెంటనే నా కస్టడీలోకి తీసుకునేఉందును ఎంత అప్రదిష్ట పని చేసిందో చూడు, పిచ్చిది!" అన్నాడు

కిన్నెర

రుద్ధమవుతున్న కంఠంలో కనుకొలకుల్లో నీళ్లు సుళ్లు తిరగడం కొంచెం దూరంలో ఉన్న ఎలెక్ట్రిక్ దీపంకాంతిలో స్పష్టంగా మిలమిలలాడుతోంది

"ఆ, వీడో దొంగ వెధవ! తీరా మనిషి చచ్చిపోయింది కాబట్టి, యిపుడు ఉదారంగా చెప్పేస్తున్నాడు కబుర్లు విన్న కలిసినపుడు ఆ విషయం కాస్త సూచనగా నైనా చెబితే యింత దారుణ మెందుకు చేస్తుందీ క్రూరహృదయం!" అనుకున్నాను నా మనసులోనే పైకి ఒక్కమాటైనా అన లేదు కొంచెంసేపు యిద్దరిమధ్యా నిశ్శబ్దం మాత్రమే అలముకుంది

అతనే అన్నాడు "పాపం ఆమె ఆఖరి సారిగా ఆనందం అనుభవించింది విన్న నాతోనే ఏమో!" బరువుగా నిట్టూర్చాడు విశ్వనాధం

బాగా చీకటి పడింది దక్షిణద్వారం అప్పుడే తెరచినట్టు గాలి "రయ్యి రయ్యి" మని వీచుతోంది ఎంత బాధతోనిండిన గుండైనా యిట్టే చల్లారుస్తోంది మౌనం గానే, యిద్దరం కలిసి బయల్దేరాం చీలుబాట వరకూ కలిసే వచ్చాం అక్కడ "సరే యింతకీ మనమేం చేయగలంలే!" అను కున్నాం పరస్పరం అభినందించుకున్నాం విడిచిపోయాం

ప్రయత్నంకూడా లేకపోలేదు తీరా సూరమ్మ యింటిదగ్గరకు వచ్చినతరువాతనే జ్ఞాపకం వచ్చింది కాంతం మరణగాథలో సూర మ్మకి కూడా ఏమైనా పాత్ర ఉండక పోతుందా? అని

ఆమె తరచు మాయింటి కేదో పనిమీద రావడం పిచ్చాపాటీ వేసుకోవడం, ఏమైనా పెరిశే తీసుకోవడం వగైరా బాంధవ్యాలు ఆమెకీ మాయింటికీ లేకపోలేదు అంచాతనే తలుపు గుద్ది ధైర్యంగా "సూరమ్మామ్మా!" అన్నాను భోజనంచేస్తూ వచ్చి తలుపు తీసింది "నువ్వా కొడకా! ఏం బాబూ యిలా వచ్చావ్?" అంది ఆప్యాయంగా "చూసేదో మాట్లాడిపోదామని వచ్చాను" అన్నాను ఇదివరకుసైతం ఏదో పనిమీద ఆమె యింటికి వెళ్లడం అలవాటు ఉంది కనక నా రాకను ఎబ్బెట్టుగా భావించలే దామె "ఆ పడకకుర్చీ ఏసుక్కూర్చో రాజా బాబూ! నావి ఎంటుచేతులూ" అన్నదామె

ఆమె భోజనంచేస్తున్న దిక్కుకు ఎదుక కుర్చీ వేసుకొని కూర్చున్నాను "అవును గాని సూరమ్మామ్మా! మీ యింట్లోఉండేదే ఆ అమ్మాయి రైలుకిందపడి చచ్చిపోయిం దటేమిటి? అన్నాను

"అవున్నాయనా మా యీరాచారి పెళ్లాం కొంప ముంచేసింది నాయనా అంది దుఃఖాన్ని ప్రతిధ్వనిస్తూ

"సరే ఆమె చనిపోడానికి అసలు కారణ మేమంటావ్? అన్నాను

సూరమ్మ గొంతు మార్చింది "బిడ్డ లాంటివాడివి నీతో చెప్పడానికేం, చెబుతా విను బాబూ! అసలు దానికీ మా యీరా చారికీ మొదట్నుంచీ పొత్తు లేదనుకో ఆదీ సైలాపచ్చీసు కుర్రదీ! అంచేత ఏ యీధిలో పెరిగితే ఆ యీధిలోనే నీ యీడు కుర్రాళ్లతో సెలగ సెలగా ఉండేదిట పాపం పున్నెం నాకు తెలియదు సుమా, చెప్పుకోవడమేగాని ఇప్పుడా యీధిలో కాదంటున్నాయా అక్కడే అద్దాల యెంక ట్రాయుడు అల్లుట్ట ఎవడో నేనెరగనుకో అణ్ణి ఉంచుకొందిట అడితోనే వుంటా ముక్కువుడక పగ్గొట్టించి అన్నీ అది యెదాన్ని కొట్టింది సరే ఆడితోనే ఎలాగో లా, సరిపెట్టుకోవాలా లోకం మీద యిదొక్కర్తే చేస్తోందా ఏమన్నానా? ఇంటింటా ఉంది మట్టిపొయ్యి ఇంత నలుగురి కోట్లోనూ పడ్డవా మరీను! చేసే దేదో జాగ్రత్తగా చేసుకోవాలా?" అంది సూరమ్మామ్మ మరి రెండు ముద్దలు తిని మంచినీళ్లు త్రాగింది గొంతు సవరించు కొంది

"ఆ ఎదవ వచ్చినోడు వీకోజూన దబ్బి య్యకపోతే ఆరోజే దాననేవాట్ట! ఏం చేస్తుందీ—దానికే ప్రాణం ఎగిరిపోయింది,

ఒంటరిగా మౌనంగా ఆలోచించుకుంటూ నడుస్తున్నాను ప్రసూతివైరాగ్యాన్నీ స్మశాన వైరాగ్యాన్నీ మించిన దేదో విరక్తి నన్నావ హించి చిత్తుచేయ నారంభించింది "ఈ సమాజపు విషవృత్తంలో పడిన ప్రతిఒక్క ళ్లమూ ఎరుగో ఎరక్కో ఈ దుర్మార్గాలకి బాధ్యులమేనేమో!" అనుకున్నాను

* * *

ఆలోచనల ఆవేగంలో గబగబా అడు గులు వేస్తున్నాను ఇంటికిపోయి ఈ ఆలో చనల పసివల్లలకి నీళ్లోసి బట్టలు కట్టాలనే

## గమనిక

1 రచయితలు తమ వ్యాసములను కాగితమునకు ఒక ప్రక్కనే విడమర్చి వ్రాయవలెను

2 ఏ వ్యాసమయినను కిన్నెర సైజు అచ్చులో నాలుగు పుటలకు లేదా ఆరుపుటలకు మించి వుండకూడదు

3 ప్రచురణ కాని వ్యాసములు పోస్టేజి స్టాంపులు పంపితేనేగాని తిరిగి పంపబడవు

4 పద్యాలు, గేయాలు ప్రకటింపబడవు

కొత్తపేటలో ఉంటారూ విశ్వనాథం అంటారే. అతన్నెరుగవు బాబూ, వీలాగే ఉంటాడు అతనికీ దీనికీ ఏడాదిక్రిందటే చూపులు కలిశాయి అప్పట్నుంచి అతను దానికోసం చూస్తూనే ఉన్నాడు ఆఖరికి నిన్న రమ్మందిట ఎల్లేముందు నాక్కూని పించి చెప్పాడుసుమా. సరే అతనెల్లడం రావడం ఆ ఉంచుకున్నోడు చూశాడట పెరటితలుపు గుద్దేట్ట మామూలుగా తీసింది "హా త్తేరి లంజకానా" అని జుత్తు దొరికించుకొని వూచీపుచ్చుకొని కొట్టాడట. లోపలిలా జరుగుతోంది యీ వీధి గుమ్మంలోంచి మొగుడు మా ఊరాచారి తలుపు గుద్దాడట సరే గబగా అతుర్రాడు పెరటిగుమ్మం లోంచి అవతలికి పోయాడట మొగుడు లోపలికొచ్చి చూసాడట కుత్రంగా ఏ..న పక్కా తీసివున్న పెరటిగుమ్మం అది కపలే అనుమానం. ఇంకేంగావాలి ఆడు మళ్లీ సావగొట్టాడంట సరే సీ..ా నాకూ మణం తీరిపోయిందని చెప్పి—అమ్మగారింటికెళ్ళ దానెమ్మతోటీ అప్పతోటీ జరిగిందంతా చెప్ప "..పిల్లని మీరు జాగ్రత్త పెట్టుకోండన్నాడంట." అని ఊపిరి పీల్చుకుంది సూరమ్మామ్మ అకస్మాత్తుగా వెలుపల బీభత్సంగా గాలిమూరం ప్రారంభమైంది ఎక్కో మాదాకపళంవాళ్ల దీనకంఠం విని వస్తే "ఇంకా భోజనాలవలేదురా నాయనా" అంటూ జాలిగా మార్దవంగా చెప్పిపంపించేంది సూరమ్మామ్మ మళ్లీ చెప్పడం ప్రారంభించింది

"రాత్తిరి రాత్రే—ఆళ్లప్ప, పెద్దాపురం దగ్గరేదో ఊరులే, యీళ్లింటికొచ్చిందట "నీకిదేం రోగంమొచ్చిందే చచ్చిందానివీ కాదు బతికిందానివీ అయ్యేవుకావు. ఎంత మంది చెయ్యడంలేదే లంజా యిలాగే నకే వీధివడ్డం? ఎంతమందికి తలొంపులు తెచ్చావ్ చూశావా?" అని నానామాటలూ అనేసిందట అంతే, ఏడిచేడిచి ఎలా విద్ర పోయిందో ఏటో పొద్దున్నలేచి గుమ్మం లో కూకుందట వీధిలో పడుకున్న యీరాచారి అప్పుడే లేచాడట "అయితే నా బత్తెంమాటేటంటావ్? ఇంట్లో ఏమీలేవు." అన్నాదంట "నీకూ నాకూ నిన్నటితోటే రుణం తీరిపోయిందే లంజకానా. నీబత్తెం మాట నాకేం తెల్సు?" అన్నాడట నాయనా. అంతే—మవీధి గుమ్మంలోంచే ఎళ్లిందట సుమా. మంచినీళ్ల నూతిలో పడదామనుకుందిట కానీ అంతా ఉంటంమూలాంచి తిన్నగా సాధూగారి మఠందగ్గరికి పోయి కూర్చుందిట అక్కడెవరో గొడ్లకాద కుర్రాళ్లు యీతపళ్లు కొట్టుకుని రెండుపెడితే తిందటకూడాను. అంతే—పదిగంటల బండికిందపడి చచ్చిపోయింది నాయనా." అంది సూరమ్మామ్మ సూరమ్మామ్మ ఏవిష యాన్నైనా ఎంతో నేర్పుగా కథచెప్పినట్టుగా చెబుతుంది ప్రతిమాటా సాగదీసి పలుకుతూ నాజూకైన సంగీతం ధ్వనింపచేస్తూ ఉంటుంది ముఖ్యంగా నాయనా అన్న పదాన్ని ఎంత హృద్యంగా ఉచ్చరిస్తుందో.

సాలోచనగా సూరమ్మామ్మ మళ్ళీ అందుకుంది "ఆడదానికే బాబూ నానా రంపారాయిళ్లూను మొగ మహారాజూకేం హాయిగా బ్రతుకుతాడు కానీ మా యీరా చారి ముఖం చూడలేకపోతున్నా బాబూ. పెద్దమ్మా నువ్వే కాచిపెట్టు అన్నాడు ఇక్కడే తొంగేస్తున్నాడు నాయనా యిప్పు డొస్తాడు" అంది నిజంగా ఆమె కంఠ స్వరం మారిపోయింది

"అయ్యో పాపం." అన్నాను

"ఎవ రేంచేస్తాంలే—దానికలాంటి చావు రాసుంది"

"నిజమే మరి సరే వస్తాను మామ్మా మళ్ళీ వర్షంవచ్చేలాగుంది" అని యింటికి చక్కావచ్చాను

నాకు తెలుసు యిలాంటి దారుణహత్య లకు గురిచేయబడుతున్న అభాగ్యజీవుల్లో కాంతం మొదటిదీకాదు ఆఖరిదీకాదు. ఇంతకీ ఆమె మరణానికి కారణభూతు లెవరు? ఈ మహాసమస్య జిమ్మిన నిప్పుల సెగకు నా కూర్మకవచమే పకేలుమని పగిలి పోతుందేమో అనే భయం కలుగకపోలేదు పాపం. కాంతం విషాదజీవితానికి, ఘోర మరణానికి నామంచి కంపోజిటర్‌వరకూ ఈ సమాజంలోని ప్రతిఒక్కళ్లమూ ఎలాగో లాగ బాధ్యులమే నేమో?



# జీవుల స్వాభావిక ప్రవర్తన - "సహజ ప్రవృత్తులు"

రాళ్లపల్లి ఫణిశాయి శర్మ

[ ఈ వ్యాసములో "సహజప్రవృత్తి" అను పదమును "ఇన్‌స్టింక్ట్" (Instinct) అనేదానికి పర్యాయపదముగా వాడుచున్నాము ]

సహజప్రవృత్తులు జీవులకు పుట్టుకతోనేవచ్చిన ప్రవర్తనావిశేషములు ఏ జీవిగాని ప్రయత్నించినా నేర్చుకోలేని పనులు ప్రకృతిదత్తమయిన ఈ ప్రవర్తనావిశేషములు జీవులకు జీవ, జాతులను రక్షించుకొనుటకు చాలావరకూ ఉపయోగపడును

సామాన్యముగా అనేక జీవులలో సహజప్రవృత్తులు విద్యాప్రభావముచే కలుషితములై నిజస్వరూపమును పోగొట్టుకొని, ఇవి నేర్చుకొన్న విద్యలేమో అనే భ్రాంతిని కలుగజేయును కాని కణుదురీగలు తుమ్మెదలు మొదలగు కీటములలో మాత్రము సాధారణముగా అకలుషితములై నిజస్వరూపంలో కానవచ్చును వీనిలో కణుదురీగల ప్రవర్తనను ఫేబర్ (Fabre) అను ఫ్రాన్సు దేశపు జీవశాస్త్రజ్ఞుడు చక్కగా పరిశీలించినాడు

## కణుదురీగల ప్రవర్తన

ఇతర కీటములవలెగాక కణుదురీగ ఏకాకియయిన జీవి సాంఘికజీవితమేకాదు సంసారమే ఎరుగని జీవి కణుదురీగ ప్రజోత్పత్తికిగాను మాత్రమే స్త్రీ పురుషులు సంధించును స్త్రీపురుషసంయోగమై స్త్రీకి ప్రసవకాలము సమీపించగా అది ఒక గూడు కట్టుటకు మొదలుపెట్టును వానివాని జాతిననుసరించి కణుదురీగలు కొన్ని గోడసందులలోను కొన్ని భూమిలోపలనూ, మరికొన్ని చెట్టుకొమ్మలపైననూ గూళ్లు నిర్మించును గూడు కట్టిన తరువాత ఆహారమును తెచ్చుటకై బయలుదేరును సామాన్యముగా ఈ జీవులు శూకకీటకములనో (Caterpillars) నాలె పురుగులనో, లేక ఈలపురుగులనో (Crickets) వెదకి తెచ్చును వానిని చంపి తీసుకొనివస్తే అవి త్వరలోనే కుళ్లిపోయి తినుటకు ఉపయోగపడవు కాబట్టి వానిని చంపక, కదలుటకు శక్తిలేనివిగా మాత్రమే చేసి ఈడ్చుకొని వచ్చి తాను ఇదివరకే తయారుచేసిన గూటికి తెచ్చును తరువాత దానితో తన గ్రుడ్లనుంచి గూటిని భద్రముగా మూసివేసి వెడలిపోవును మరల తన పిల్లలగతి ఏమయినదనికూడ విచారించదు ఆ గ్రుడ్లనుండి పుట్టిన పిల్లలు తమ ప్రక్కలో ఉంచబడిన ఆహారమును సేవించి పెరిగి పెద్దవై గూటిని పగులగొట్టుకొని బైటికివచ్చి తమ స్వతంత్రజీవితమును ప్రారంభించును గ్రుడ్లనుండి బైటికివచ్చిన జీవులు, తమ తల్లి ప్రవర్తనగాని, తమజాతికి చెందిన ఇతర జీవుల ప్రవర్తనగాని ఎప్పుడూ చూడకున్నా పెరిగి పెద్దవైనతరువాత ఇదేవిధముగా ప్రవర్తించును

కష్టపడి సంపాదించినదానిలో అవశ్యమయినంత మాత్రమే ఖర్చుపెట్టి మిగతా డబ్బును సేవింగ్స్ బ్యాంకులోనో లేక ఇంకే విధముగానో తన పిల్లలకు రాబోయే రోజులలో ఉపయోగపడునని కూడబెట్టే మానవునికి కణుదురీగ ఎంతో బుద్ధిగల జీవియనీ దానికి చాలా దూరదృష్టి కలదనీ అనిపించకపోదు కాని మానవ ప్రవర్తనను స్థాయిగా తీసుకొని ఇతర జీవుల ప్రవర్తనను వ్యాఖ్యానించబోతే ఇటువంటి భ్రమపాలగుట తప్పదు

ఒకసారి ఒక కణుదురీగ ఈలపురుగొకటిని తీసుకొనివచ్చి తన గూటిముందర విడిచి గూటిలోపల అంతా క్షేమముగా నున్నదో లేదో అని తెలుసుకొనుటకు కాబోలు, ఒంటరిగా లోపలికి పోవుచుండుటను ఫేబర్ చూచినాడు అది లోపలికి పోయిన తరువాత ఆ ఈలపురుగును కొంత పక్కకు జరిపితే కణుదురీగ ఏమిచేయునో చూడవలెనని అట్లానే చేసినాడు కొంతసేపటికంతా అది బైటికివచ్చి తాను విడిచివెళ్లిన జీవి అక్కడ లేకపోవుటను గమనించి దిగ్భ్రమచెందినది కాని ఇంతలోనే అది కానరాగా, దానిని ఈడ్చుకొనివచ్చి యథాపూర్వము గూటిముందర పడవేసి మరల ఒంటరిగానే లోపలికి పోయినది ఫేబర్ మరల దానిని దూరముగా ఉంచగా, కణుదురీగ తన పాతపాఠమునే ఒప్పించినది అతడు 40-50 సారులు అట్లనే చేసిచూచినా దాని ప్రవర్తన మాత్రము ఒక రవ్వంతకూడ మారలేదు అంతకుముందే లోపలికి పోయి బాగ పరిశీలించిన గూటిని మరల మరల చూడవలసివ

అవసరము లేదనే విషయము ఆ జీవియొక్క "సూక్ష్మబుద్ధి"కి ఏమిచేసినా ఎక్కలేదు గ్రామఫోను తట్టవలె అది పాడినపాటనే పాడినది "పెక్‌హామ్స్' (Packhams) అను అమెరికాదేశపు దంపతులు ఇదే పరిశోధనచేసి ఈ జీవి విషయములో ఫేబర్ కంటే ఎక్కువ సహనము చూపగా ఎప్పుడో ఒకసారి అది తన ప్రవర్తనను మార్చుకొని ఈలపురుగును వేరుగా గూటిలోపలికి తీసుకొనిపోయినదట।

పాంపీలియస్ (Pompilious) అనబడు కణుదురీగయొక్క విచిత్రప్రవర్తనను పెక్‌హామ్ దంపతులు చాలా బాగ వివరించినారు ఈ జీవి తన పిల్లలకొరకు సాలెపురుగును పట్టితెచ్చుట తరువాత దానిని ఏదయినా ఒక చిన్న చెట్టుకొమ్మకు తగిలించి, గూడు కట్టుటకు మొదలుపెట్టును చెట్టుకొమ్మకు తగిలించియుండుటచే ఆ పురుగు చీమలు మొదలగు ఇతర జీవులకు సులభముగా దొరకదు గూడు కట్టుటయందు కణుదురీగ నిమగ్నమైయున్నప్పుడు ఆ సాలెపురుగును తీసివేసి దానికి బదులు ఇంకేదయినా ఒక జీవిని ఆదేస్థలములో పెట్టితే కణుదురీగ గూడుకట్టినతరువాత వచ్చి చూచి పరిస్థితులు మారిపోయినవని ఎట్లనో గ్రహిస్తుంది కాని సిద్ధముగా నుంచిన ఇంకొక జీవిని తాకకుండా మరల ఆహారాన్వేషణ ప్రారంభిస్తుంది వేటాడి ఇంకొక జీవిని తీసుకొనివచ్చి మొదటివలెనే దానిని చెట్టుకొమ్మకు తగిలించి ఇంతకుముందే తాను తయారుచేసిన గూడు సిద్ధముగా నున్నప్పటికీ దానిని ఉపయోగించకుండా క్రొత్తగా మరొక గూడు కట్టుటకు మొదలుపెడుతుంది శాస్త్రజ్ఞులు తెచ్చిపెట్టిన ఆహారము దానికి సహించలేదనుకున్నా తానే స్వతః నిర్మించిన గూడు ఉపయోగకారి కాకపోతుందా ?

ఈ ఉదాహరణములనుండి మనము గమనించవలసిన విషయమింతే ఈ జీవియొక్క ప్రవర్తన సంపూర్ణముగా ప్రకృతిపైన ఆధారపడియుండును తన పనులనుండి కలిగే పరిణామములనుగాని, వాని మంచిచెడ్డలనుగాని అది తెలుసుకోలేదు క్రొత్త పరిస్థితులకు తగినట్లు తన ప్రవర్తనను అది మార్చుకోలేదు దాని ప్రవర్తన ప్రకృత్యధీనమైనప్పటికీ ఆ జీవి ఏదో ఒక నిర్దిష్టమయిన సంకల్పసిద్ధికై (Attainment of a purpose or goal) నిరంతరముగా ప్రయత్నించుచున్నట్లు మనకు గోచరించును సహజప్రవృత్తి రూపమయిన ప్రవర్తనయందు సర్వదా ఏదో ఒక సంకల్పం (Purpose) ఇమిడిఉంటుంది కాని అది వ్యక్తియొక్క సంకల్పము (Individual Purpose) కాదు ప్రకృతిసంకల్పము (Biological Purpose) మాత్రమే

తమ పరిస్థితులలో క్రొత్తగా కలిగిన మార్పులకు అనుగుణముగా తమ ప్రవర్తనను ఈ జీవులు మార్చుకోలేవని ఇదివరకే తెలుసుకొంటిమి కాని వీటికి ఏ జీవిగాని అనుభవమువలన ఏ విద్యనూ నేర్చుకోలేదు అని చెప్పుట తప్పు కీటముల జీవితమంతా సహజప్రవర్తనతోనే నిండియున్నట్లు కానవచ్చినా కొన్ని క్రొత్తవిషయములను అవి గ్రహించగలవని పరిశోధనలనుండి తెలియవస్తుంది ఉదాహరణకు తుమ్మెదలను వాని నివాసస్థానమునుండి దూరముగా తీసుకొనిపోయి విడిచిపెడితే అవి మొట్టమొదట దిక్కుతోచనివానివలె ప్రవర్తించినా కొంతసేపటిలోనే స్వస్థానమును వెదకుకొని రాగలవు ఒకవిధమయిన ప్రదేశజ్ఞానమునూ జ్ఞాపకశక్తినీ అవి సంపాదించలేకున్న ఈ పని అసాధ్యమవును గదా ! అయినా ఈ జీవులకు తమ సహజప్రవృత్తులను మార్చుకునే శక్తిగాని క్రొత్తవిద్యలను నేర్చుకునే శక్తిగాని చాలా స్వల్పమని మనము గమనించవలసియుంటుంది

## ఉచ్ఛజీవులలో సహజప్రవృత్తులు

సహజప్రవృత్తులు కీటకములలో మాత్రమేకాదు జీవకోటి నంతా అభివ్యాపించిన ప్రవర్తనావిశేషములు జీవవికాస వాద తత్వములప్రకారం ఉచ్ఛములని గణింపబడిన జీవులలోకూడ (Higher Animals) వాటిని చూడవచ్చును కాని ఒక్క విశేషమేమంటే వికాసదృష్ట్యా జీవులు ఎక్కువ సంకులములయినట్లంతా వాని సహజప్రవృత్తులు సులభముగా మార్పుచెందగలవు

"ఆహారాన్వేషణ సహజప్రవృత్తి" (The Food-seeking Instinct) అన్ని జీవులకు సామాన్యమైన గుణము కాని కీటకములలో అవి తినదగిన ఆహారము లేక జీవి దానిని తెచ్చు, లేక చంపు విధము మొదలగు అన్ని విషయములు ప్రకృతిచే నిర్ధారింపబడియుండును ఆ జీవులు చేయవలసినదంతా "జీ హుజూర్" అనడమే ఆజ్ఞపరిపాలనలో అంతరాయములు కలిగితే ఎట్లు వానిని తప్పించుకోవలెనో అవి ఎరుగవు ఉచ్ఛజీవులకు ఈ కష్టములు తక్కువ ఆకలయినప్పుడు ఆహారమును సంపాదించుటకు ప్రయత్నించవలెనను ప్రణోదనం (Impulse) వానిలోకూడ కలిగినా, ఎటువంటి ఆహారమును ఎట్లు సంపాదించుకోవలెననే ప్రశ్నలను అవి తేల్చుకోవలసినదే ప్రకృతి వానికి అంతవరకూ సహాయము చేయదు ఎలుకలను పట్టుట పిల్లికి సహజమయిన గుణమని మన మందరూ అనుకుంటున్నాముగాని అది తప్పని చైనాదేశపు మనః శాస్త్రజ్ఞుడుకూడ కూఓ (Kuo) పరిశోధనలనుండి తెలియవస్తుంది అప్పుడే పుట్టిన పిల్లులను రెండు గుంపులుగా విభజించి, "కూఓ" ఒకగుంపును ఎలుకల మధ్యనూ, ఇంకొకదానిని పెద్ద (ఎలుకలను పట్టుటను) పిల్లులమధ్యను పెంచినాడు దీనినుండి తెలిసిన ఆశ్చర్యకరమయిన విషయమేమంటే పెద్ద పిల్లుల జతలో పెరిగిన పిల్లులు మాత్రమే ఎలుకలను చంపినవి ఎలుకల మధ్యన పెరిగిన పిల్లులకు ఈ విద్య రాలేదు అవి ఒక్క ఎలుకనుగూడ చంపుటకు కావలసినంత అవకాశము అనుకూలము ఉన్నా చంపలేదు కూఓ అన్నారు పిల్లికి ఎలుకను చంపుట సహజమయిన గుణమని మొండివాదము చేస్తే దానికి ఎలుకను ప్రేమించుటకూడ ఒక సహజమయిన గుణమని వాదించవలసియుంటుంది అని ఈ తత్వము మానవులకుకూడ అన్వయిస్తుంది ఆకలైనప్పుడు కడుపు నించుకోవలెననే విషయము అందరికీ సామాన్యమయిన గుణమయినప్పటికీ మనలో కొందరు సస్యాహారులు మరికొందరు మాంసాహారులు భారతీయులు చేతులతో భోజనము చేస్తే ఆంగ్లేయులు కత్తి ఫోర్కులతోనూ జపాను దేశీయులు కఱ్ఱపుల్లల (Chop-sticks) తోనూ తినెదరు ఉచ్ఛజీవులలో సహజప్రవృత్తులలోని ప్రణోదన మాత్రమే నైజము దానిని తృప్తిపరచు విధానములు నేర్చుకొన్నవి ప్రతి జీవి తన జీవితములో నేర్చుకోవలసినవి

ఇట్లు సహజప్రవృత్తులకూ, జీవుల నేర్పుకూ (Learning) దృఢమయిన సంబంధము కలదు నీచజీవులకు (Lower animals) అన్నివిధముల ప్రకృతిసహాయమున్నది కాబట్టి నేర్పు తక్కువ వాని పరిస్థితులు సామాన్యముగా మార్పుచెందవు కాబట్టి వానిని కొత్తగా నేర్చుకోవలసిన ఆవశ్యకతకూడ స్వల్పము ఉచ్ఛజీవుల పరిసరములలో తరచుగా మార్పులు కలుగుచుండుటచే, వానికి నేర్పుయొక్క ఆవశ్యకత ఎక్కువ అందుకనే వాని సహజప్రవృత్తులకు నమ్యత (plasticity) కూడ ఎక్కువగా ఉంటుంది



# మనమూ - మన తెలుగూ

నాయని కృష్ణకుమారి

ఆంధ్రులకో రాష్ట్రం వచ్చింది రాష్ట్రం వెంటబడి అశేషమైన సమస్యలూ వచ్చినయ్ మన నాయకులు సమస్యలు విడదీసే వాళ్ళుకారు పైపెచ్చు కొత్తవి కల్పించుకుంటూ ఆ జాలంలో పడి అల్లీ బిల్లీ తిరిగేవాళ్ళు

నాకు రాజకీయాలు తెలియవు శ్రద్ధకూడా లేదు కాని ఆంధ్రులకో భాష ఉందన్న విషయం నాకేకాదు అందరికీ తెలుసు అది తెలుగు భాష తెలుగు భాష తియ్యగా ఉంటుంది కమ్మగా ఉంటుంది తేనెలూరుతూ ఉంటుందని అందరూ అంటారు ఆ తియ్యదనాన్ని కమ్మదనాన్ని తేనెలూరేతనాన్ని తెలుగువాళ్లలో ఎందరు భాగ్యశాలు లనుభవిస్తున్నారయ్యా అని నేనంటాను ఇది వెంటనే జవాబుచెప్పడానికి సులువైన ప్రశ్నకాదు అన్ని గందరగోళాలమధ్యా విడతీయరానంతగా చిక్కుపడ్డ దృఢసమస్య కాని యీ సమస్య సమస్యలా కనిపించడంలేదు అస లిటువంటి అశాంతి తెలుగుగుండెల్లో రేగిందన్న సందేహమైనా ప్రముఖులకు తట్టలేదు మనం సామాన్యులం పెద్దలు నడిపితే నడిచేవాళ్లం మన భావాలూ, బాధలూ మన హృదయాల్లోనే ఆక్రోశిస్తుంటయ్ బయటకు వినపడవు వినపడ్డా వినపడ్డట్టు నటించరు నాయకులు

నన్ను బాధించే విషయాలు రెండే రెండు మనకు రాష్ట్రం వచ్చింది మనలను మనం పరిపాలించుకుని అన్ని లోటుపాటుల్ని సరిదిద్దుకోగలిగే శక్తి మనకు వచ్చింది తెలుగు భాష స్థితిని ఎట్లా నిర్ణయిస్తారు? దానిని వెనుకటికిమల్లే అలంకారాలమధ్యా అరసున్నాలమధ్యా కట్టి ప్రజల కందుబాటులో లేకుండానే ఉంచుతారా? లేక సర్వసామాన్యప్రజావళికి దాని తియ్యదనాన్ని పంచిపెడ్తారా?

మరొక విషయం ఆంధ్రప్రభుత్వపు అధికార ముద్ర చూశాను ఛెళ్లున వీపు చరిచినట్లయింది "ఆంధ్ర ప్రభుత్వము" అని తెలియజేసే పదసముదాయం ఇంగ్లీషుకో ఎన్నది అదీ అగ్రస్థానంలో ఇది పెద్ద తప్పని నేనంటాను సమర్థించడానికి సిద్ధమయ్యేవాళ్లు అన్నిచోట్లా అన్ని కాలాలలోనూ ఉంటారు ప్రముఖులకందరికీ ఇదొక విపరీత మనఃస్థితి వాళ్ల మేధ సర్వత్ర అన్ని విషయాలలోను ప్రసరించదు ముఖ్యంగా సామాన్యులు చెప్పే మాటల్లో కొంత సత్యమున్నదని చర్చించడం వాళ్ల పెద్దతనానికే అవమానం నేనిదంతా హృదయం మండి ఉద్రేకంతో వ్రాస్తున్నాను కాని ఇదొక వ్యాసం ఏపత్రికలోనో పడుతుంది వ్యాసాలు చదివే అలవాటు మన తెలుగువాళ్లకే లేదు అందులో పెద్దలకు పత్రికలు చూడడానికి తీరిక ఉండదు ఉన్నా చూడరు

ఇంగ్లీషువాళ్లు మననెత్తిన రుద్దిపోయిన వాళ్ల భాషా వ్యామోహం మనలో ఇంతగా ప్రబలింది అది స్వతంత్రం సంపాదించుకున్న భారతదేశంలో సడలలేదు రాష్ట్రపాలనాశక్తి సంపాదించుకున్న ఆంధ్రలోనూ చావలేదు—ఈ విపరీతపు మోజు ఎప్పుడు తగ్గుతుందా అనేది నన్ను బాధించే రెండవ విషయం

"ఇంగ్లీషనేది ప్రపంచం నలుమూలలా విస్తరించిన భాష దాన్ని మర్చిపొమ్మంటావా?" అని కసిగా నన్నడగండి నేను సమాధానం చెప్తాను అసలా ప్రశ్న రావడమే పిచ్చితనం వచ్చిన భాషను మర్చిపొమ్మని ఎవరూ చెప్పరు శుద్ధంగా పరభాషైనా నేర్చుకునే అవకాశాలు కలగజేస్తే నేర్చుకోవద్దనీ ఎవరూ చెప్పరు

కాని యీనాడు మనదేశంలో ఉన్న ఇంగ్లీషుస్థితేమిటి?— ఎంతమంది పట్టభద్రులు ఇంగ్లీషులో నిర్దుష్టమైన ప్రావీణ్యాన్ని సంపాదించుకుంటున్నారు? అసలు వాళ్ళ కా భాష చెప్పేదెవరు? ఆ భాషలో నిష్ణాతులైన పండితులు చెప్తున్నారా? అక్షరజ్ఞానం కలిగి ఉపాధ్యాయ పదవికి అర్హుడైన ప్రతివాడూ దాన్ని చెప్పగలిగి ఉండాలి అనేది ఒక నిర్బంధం। చెప్పేవాళ్లకు రాదు నేర్చుకునే వాళ్ళకూ సహజంగా రాదు ఈ రకంగా మనదేశంలో ప్రపంచ భాష అయిన ఇంగ్లీషును చంపకుండా బ్రతికిస్తున్నామనుకోవడం వెఱ్ఱితనం

గమనించదలచుకుంటే ఇంకొక విషయం చెప్తాను ఇంగ్లండులో సర్వవ్యవహారాలూ ఇంగ్లీషులో జరుగుతయ్ అంతమాత్రాన విదేశీయ భాషలు జర్మనూ ఫ్రెంచీ లాటినూ వంటివి అక్కడ చావలేదు పైపెచ్చు ఉజ్జ్వలంగా అత్యున్నతస్థితిలో ఉన్నయ్ అంటే ప్రతివాడికీ ఆ భాషలు శుద్ధంగా వచ్చునిగానీ నేర్చుకోక తీరదనే నిర్బంధం వాళ్లు కలగజేశారనికానీ కాదు అర్థం ఆయా భాషాగ్రహణంలో కుతూహలం కలవాళ్ళకు పూర్ణంగా అవి నేర్చుకో

గతిగే అవకాశాలు కలుగజేశారు వాళ్లు మనమూ అట్లా ఎందుకు చెయ్యగూడదు? మాతృభాషలోనే సర్వవ్యవహారాలూ నడపండి- జాతీయభాష రాజ్యాంగానికి సంబంధించినవారిని విధిగా నేర్చుకో మనండి ప్రపంచభాష ఇంగ్లీషును ప్రతి భారతీయుడూ నేర్చుకోవా లన్న నిర్బంధ మెందుకు? ప్రతివాడూ విదేశాలకు ఊరేగడం లేదే। కనీసం ఒక్క డిగ్రీ అయినా సంపాదించడానికి ఆర్థిక ప్రోత్సాహ లేక ఏ గుమస్తాలుగానో మగ్గే ప్రజలే ఇక్కడ ఎక్కువ చదువులు చదివీ ప్రయోజనరహితంగా నిరుద్యోగులుగా ఉండే వ్యక్తుల సంఖ్యే ఇక్కడ ఎక్కువ వీళ్లందరూ తప్పనిసరిగా చదివిన చదువులు ఇంగ్లీషులో చదివి ఆ పరభాషను నేర్చుకోవల సిన అవసరమేముంది? అదీ ఒక్కవాక్యం సరిగా వ్రాయడం చేత గాని ఇంగ్లీషు। స్పెల్లింగ్ తెలియని ఇంగ్లీషు

మనదేశంలో వచ్చిపోయే ఇంగ్లీషును బ్రతికించడం ఎందుకు నేర్చుకోరు? అందరి నెత్తినా అసమగ్రమైన భాషాభూపాన్ని నెట్టి నేర్చుకోమని నిర్బంధించకుండా ఇష్టమున్నవాళ్లు సమగ్రంగా నేర్చుకునే అవకాశాలు కల్పించండి ఇంగ్లీషు చెప్పడానికి ఉద్దండు లైన పండితుల్ని ఆ భాష మాతృభాషగా కల విదేశీయుల్ని నియ మించండి ఇంగ్లీషుమీద కౌతుకం ఉన్న ప్రతి అభిమానీ దాన్ని అభిమానవిషయంగ గ్రహిస్తారు మెరికల్లాంటి ఆ పండితుల చేతుల్లో భాష పరిపూర్ణంగా నేర్చుకోగలుగుతారు ఆ భాష నేర్చు కున్నవాడే విదేశాలకు వెళ్లగలడనే ఆశ నాడా పెట్టండి ఈ ఆశకు చాలామంది లొంగుతారు లొంగనివారు మాతృభాషలో బోధించ గలిగే ఉపాధ్యాయు లవుతారు గుమస్తా లవుతారు మాతృభాషలో జరిగే రాజ్యాంగంలో ప్రధాన పాత్రలు వహిస్తారు అంతే ఇట్లా నేను చెప్పడంలో పొసగని దేమున్నది?

రెండవది మాతృభాషలో సర్వవ్యవహారాలనూ నడపడం. దీనికి అభ్యంతరంగా "తెలుగులో ఈ వ్యవహారాలన్నీ సాఫీగా జరగవండీ" అంటారు ఇంగ్లీషులో సర్వవ్యవహారాలూ నడపడం పోకపోవడంవల్ల ఇంగ్లీషు కావాలంటారు ఈ పోషితనం ఎవరు నెప్పిపెట్టున్నది? స్వతంత్రం సంపాదించుకున్న భారతదేశంలో వ్యవహారాలన్నీ ఇంకా ఇంగ్లీషులో ఎందుకు? మాతృభాషలో లేని విషయబోధనాశక్తి ఇంగ్లీషులోనే ఉన్నదనా? ఇంగ్లీషు పదాల కన్నిటికీ తెలుగు వ్రాసుకోవాలి సైన్సు మొదలైన విషయాలన్నిటి లోనూ వచ్చే సాంకేతిక పదాలకు తెలుగుపదాల పట్టిక తయారు చేసుకోవాలి అది సామాన్యమైన పనా? ఏట్లా ఎట్లా పదుతుం దంటాం మొదలుపెడితే ఏ పనైనా సాగుతుంది లేకపోతే నగరనేది కలగద మెట్లా?

అయినా నాకు తెలియకడుగుతాను ఇట్లా పట్టికలు తయారు చెయ్యడం ఎంతవరకూ అవసరం? మనకు నెత్తిమీది దేవత ఇంగ్లీషుభాషలో జర్మన్‌పదా లెన్నో ఉన్నయ్ లాటిన్ పదా లున్నయ్ అట్లా ఉన్నందుకు వాళ్లేమీ అనుకోరు వాటిని విర సించరు భాష ఎప్పుడూ ప్రవాహి అది తనకున్న సామగ్రితో తృప్తిపడక ఆ అహా ఈ అలమూ భోగుచేసుకుంటూనేఉంటుంది అందుకే ప్రతి భాషలోనూ ఇతరభాషా పదాలు కలుస్తూనేఉంటయ్ దీన్ని ఆగమన్నా ఆగదు

మన తెలుగులో కలిసి వ్యవహారంలో విడదీయరానంతగా కలిసిన ఇంగ్లీషు పదాలెన్నో ఉన్నయ్ కలక్టరు రైల్వేస్టేషన్ ఫస్టు—ఇటువంటివి ఎన్నో ఎన్నో।—కలక్టరు వ్యవహారంలో పామరుల్లో కలకటేరుగాకూడా రూపొందింది "స్టేషన్" "టేశన్" అయింది "ఫస్టు" "పస్టు" అయింది ఇటువంటివాటి కన్నిటికీ "మండలాధిపతి" అనీ "ధూమశకటవిలయమ"నీ ఇట్లా ఇట్లా పట్టికలు తయారుచెయ్యడంలో సబబెంతవరకు? అట్లాగే విద్యావిషయంలోకూడా "కెమిస్ట్రీ" అంటే విద్యార్థికి సులు వుగా అర్థమయ్యేటప్పుడు దానికి రసాయనిక శాస్త్రమని ఎందు కనాలి? ఈ పట్టికప్రకారం "నైట్రికాసిడ్" నత్రికామ్ల మవుతుంది "హైడ్రోక్లోరిక్ యాసిడ్" ఉదజహరికామ్ల మవుతుంది అది ఇంగ్లీషు ఇది సంస్కృతం రెండూ మనవికావు ఇంత కష్టపడి యీ పట్టికలు తయారుచేసుకునేకంటే ఇంగ్లీషులో లాటిన్ పదా లున్నట్లుగానే మనభాషలో ఇవీ ఉన్నాయనుకుంటే సరి మరీ అవసరమైనవీ మార్చకపోతే ఎబ్బెట్టుగా కన్పించేవీ మార్చుకోనూ వచ్చు పట్టికలు తయారుచేసుకోనూవచ్చు ఇది పూనుకుంటే త్వరగా సులువుగా అయ్యే పని

ముఖ్యంగా విద్యాబోధవిషయంలో ఈ ప్రచారాన్ని అమ లులో పెట్టవలసిన విధి విశ్వవిద్యాలయాలది ఆంధ్ర విశ్వవిద్యా లయాధికారు లెప్పటికప్పు డీ విషయాన్ని సమర్థిస్తున్నట్లే కని పిస్తారు నిద్రలో ఉన్నవాళ్లను తట్టిలేపితే ఉలిక్కిపడి లేచి అవ లించి చేతులు ఆడించినట్లుగానే ఏదో పనికి పూనుకోబోతున్నట్లు మధ్యపెడతారు ఏమీ లేదు అంతా మాయ।

పుస్తకాలు మాతృభాషలో కావాలి వ్రాయిస్తాం అవి తయారైనవెంటనే విద్యాబోధ ఆ భాషలో మొదలవుతుందన్న సూచన ఎన్నిసార్లు చేశారో వారు। పుస్తకాలు వాళ్లు వ్రాయించరు వ్రాసేవాళ్లను ప్రోత్సహించరు అసలు వ్రాయనివ్వరు ఇంగ్లీషు వదలుకోలేని మమకారంలో పడి మాతృభాషకు అన్యాయంచేయడ మేం న్యాయం? ఆంధ్రరాష్ట్రం రావడానికి ఒక శ్రీరాములు ప్రాణాలు చాలినయ్ ఆంధ్ర ప్రజానీకమంతా ఉపవాసాలు చేసి గతించినా ఆంధ్ర విశ్వవిద్యాలయంమాత్రం మారదు కులపర్వతాల కన్నా అచలంమైంది త్రిమూర్తులకన్నా పురాతనమైంది అది।

కి న్నె ర

మా ఆశలు ఫలించి తెలుగే ఆంధ్రలో సర్వవ్యవహారదక్షమైన భాషగా ఏర్పడితే ఆ భాష ఎట్లా ఉండాలి? దానికి ఉండవలసిన స్థితి ఎటువంటిది? అనేది మరొక సమస్య ఈ విషయాన్ని ఈ వ్యాసంలో మొట్టమొదటే స్పృశించాను అలంకారాల మధ్యా అరసున్నల మధ్యా పారాహుషారులతో నడిచే తెలుగుకాదు కావలసింది మనకు ప్రతి తెలుగువాడికీ సుబోధకమై వాడు మాట్లాడే భాషతో సరిపోలే తెలుగు; భాషలో ఈ రకమైన మార్పు ముమ్మందుగా విద్యాలయాల్లోనే కలగాలి ఈనాడు నేర్చుకునే కృతకమైన భాషను గుర్తించి సజీవ వ్యావహారిక భాషలో విద్యాబోధ జరిగితీరాలి అప్పుడే పాశ్చాత్యదేశాల్లో ప్రతి ఉపాధ్యాయుడూ మాతృభాష ఉద్బోధించగలిగినట్లు మనలో ప్రతి అధ్యాపకుడూ తెలుగు బోధించగలడు

ఇంగ్లీషుంది! ఆ భాషకు మన నన్నయ భాషవలె ప్రామాణికమైన భాష "King's English" అనేది కాని దాన్ని వాళ్ళ అంతటితో అష్టదిగ్బంధనమూ చేసి మేకులువేసి బిగించలేదు స్వేచ్ఛగా పెరగనిచ్చారు ఆరోగ్యకరంగా, భాషకు సహజమైన మార్పులవెంబడి పెరగనిచ్చి ఆ పెరిగే భాషను ఆప్యాయంగా ఆదరించారు ఆ మార్పులను గమనించే జిజ్ఞాసువు ఉండబట్టే ప్రతి అయిదు సంవత్సరాలకూ వాళ్ళ భాషకో వ్యాకరణం వెలిసింది అంటే వాళ్ళు మనలాకాక, మాట్లాడే భాషను ఆమోదించి వ్రాసే భాషగా మార్చుకున్నారు మనం ఆ పని చెయ్యలేదు నిరసించడం నేర్చుకున్నాం పైపెచ్చు కొత్త ప్రయోగాలనూ పలుకుబళ్ళనూ ఏ జిజ్ఞాసువైనా తన కావ్యంలో చేరిస్తే ఇది నన్నయ భాషకాదనీ, మా చిన్నయ వ్యాకరణానికి కట్టుబడిలేదనీ—ఈ కారణాలవల్ల ఆ కావ్యం దుష్టకావ్యమనీ బెదిరించి అటువంటి అవకాశాలను చేతులార మనమే జారవిడుచుకున్నాం

మన భాషకు కలిగిన దురదృష్టమే యిది ఈ చిక్కు ఆనాటిదీ యీనాటిదీ కాదు నన్నయభట్టునుంచి చిన్నయసూరి వరకూ వ్రాయగలిగిన ప్రతివాడూ ముడులమీద ముడులువేసుకుంటూ తయారుచేసుకున్న చిక్కు దీన్ని ఛేదిస్తే తెలుగుభాష ప్రామాణ్యం పడిపోతుందంటారు తెలుగుసౌందర్యం శిథిలమైపోతుందంటారు ఇవన్నీ అర్థంలేని మాటలు పూర్వుల కావ్యరచనాధోరణి ఈనాడు లేదు పూర్వకావ్యాలు చదివి ఆనందించేవారున్నా వ్రాయడానికి ఇచ్ఛగించేవారు లేరు పూర్వంలా పద్యాలంటే మోజుపడి తహతహలాడేవాళ్లూ ఈనాడు లేరు సాహిత్యస్వరూపమే దానంతట అది మారుతున్నది మనుష్యుల మనస్తత్వాలలో కలిగిన పరిణామం సాంఘికంగా కలిగే విప్లవాలు ఇతర భాషాసాహిత్యాలకు మన భాషపైనున్న ప్రభావం—ఇవన్నీ తెలుగును మార్చివేస్తూనేఉన్నవి పండితులెంత అడ్డుకుంటున్నా ఆ మార్పు అదే వస్తుంది వస్తున్న మార్పును సానుభూతితో స్వీకరించగలిగితే ఆరోగ్యకరం

తెలుగుభాష ప్రతి తెలుగువాడికీ అర్థమయ్యే స్థితికి తెచ్చుకోండి ఇదే పూజ్యులు గిడుగువారు తమ సర్వశక్తుల్నీ ధారపోసిన వ్యావహారిక భాషావాదం దీన్నిగురించి చెలరేగిన దుమారాలు పండితులు తెచ్చుకున్న కోపం కలిగిన ప్రచారం అన్నీ తెలిసీ, నా మాటలు పనికివస్తాయని మళ్లీ చెప్పబోవడం హాస్యాస్పదం కాని సత్యమైన విషయం వ్యావహారికం గ్రాంథికం కావాలి ఆంధ్రరాష్ట్రంలో ఆంధ్రభాషకో స్థితి దీనివల్లనే కలుగుతుంది ప్రజాహృదయంలో ఉయ్యాలలూగే కోర్కెను పండితులు గౌరవించలేకపోయినా అంగీకరించక తప్పదు విశ్వవిద్యాలయాలు ఆమోదించకపోయినా విధిలేక చేపట్టవలసిన ఘడియలు రాకతప్పదు దీన్నిగుర్తించి తమంతటతామే విశ్వవిద్యాలయాధికారులు ప్రోత్సహించగలిగితే ఎంత భాగ్యం!



# కవి - విమర్శకుడు

కాందూరు నరసింహాచార్యులు

శబ్దార్థముల రచనావైశిష్ట్యముద్వారా లోకోత్తరవర్ణనావైచిత్ర్యముచే ప్రకృతి నలంకరించి భావనాబలమున సహృదయుల హృదయములను రసోత్తరంగముల గావించువాడు కవి. ప్రకృతి చిత్రణ సంకల్పమున నా ప్రకృతితో లీనమైపోవు నా కవికి శక్తి, నిపుణత లోకశాస్త్రకావ్యాద్యవేక్షణములు అతని విశిష్ట రచనకు మెఱుగు పెట్టి నిరంతరము చెక్కుచెదరని యలంకారముతో నవనవోన్మేష శాలిత్వమును సమకూర్చుచు లోకోత్తరత్వమును సాధించును. కవి తన కిష్టములైన కొన్నిపదముల నేరుకొని భద్రపరిచి యా పదముల యల్లికచే నా రచనమును సాగించెద ననువాడుగా నుండడు. అట్టి రచనము కృత్రిమమగుటచే కుంటి కుంటి నడచుచు రసికజన హృదయంగమము కాకపోవుటయేగాక పరిహాసాస్పదము నగును. పదములు మున్నుగునాని నేర్చికూర్చి హృదయదర్పణమున కవితా కాంతాసౌందర్యమును దిద్దుకొని మురియుట విమర్శకుల పని. రచనాదృష్టి వేరు విమర్శనాదృష్టి వేరు. దృఢమూలమైన కవి సంకల్పమునకు తత్తద్రసానుకూలమైన శబ్దజాలము అహమహమికతో పరుగిడివచ్చి ప్రత్యక్షమై రచనావైశిష్ట్యమునకు తోడ్పడు చుండును. ఇందుకు కవికి దిట్టమైన లోకానుభూతి భావనాబలము సాధనములు. పదముల నేరుకొని రచనకు కూర్చుండువాడు పదములు నేర్చిన చిలుక.

కవి విమర్శకుడు కావచ్చును విమర్శకుడు కవి కావచ్చును కాని కవియైనపుడు విమర్శకుడు కాడు. విమర్శకుడైనపుడు కవి కాడు. కావ్యమును చిత్రించినతర్వాత తన కావ్యమును తాను విమర్శించుకొనువాడౌగాక.

కవి హృదయము నవగాహన చేసికొని కావ్యమునందలి గుణదోషముల వివరించుచు రసభావాద్యౌచిత్యముల తేల్చుచు అందలి సారమును ప్రపంచమునకు చాటువాడు విమర్శకుడు. నిష్పక్షపాతబుద్ధి ప్రకృతిసమన్వయదృష్టి యతనికి విశిష్టగుణములు. విమర్శనమున తన ప్రత్యేకత నవలంబించువాడు నైజతండి కుడు. నైతండిక హృదయము ద్వేషాసూయలకు మార్గము చూపును. సత్యము నెఱింగి తత్త్వమును నిరూపింపజాలకపోవుటయేగాక తన స్వరూపమును బహిరంగపరచుకొన్నదగును.

ఇతివృత్తము సంఘటన కల్పన, గుణములు పదవాక్యవిశిష్టత పాకము ప్రకరణాద్యౌచిత్యము భావగాంభీర్యము మొదలగు సంశములు రసాభివ్యక్తి కెంతమాత్రము తోడ్పడుచున్న విషయమును నిరూపించుట నిజమైన విమర్శకుని పని. కేవలాభిమానమును ప్రదర్శించునా తసూయాపరుడు. కొన్ని విషయములలో నభిమానము మంచిదేమోగాని యట్టి విషయములలో నసూయాది సత్యమును తారుమారు చేయగలదు. నిష్పాక్షికుడైన విమర్శకుడు కవి ప్రతిభాప్రతిష్ఠలను విశ్వవ్యాప్తముల చేయగలడు. కుత్సితుడు కేవలాభిమానపూర్వకములైన ప్రచారములచే ప్రపంచమునకు ద్రోహియగును. ఇందుకు ఆత్మశ్లాఘలు పరనిందలు తోడ్పడెనేని నోరెత్తవలసిన యవసరమే యుండదు. గుణములను శ్లాఘించుట దోషముల నుపేక్షించుట లేదా సునమార్గమున నవరించుట యుత్తమ లక్షణము.

"గుణదోషౌ బుధోగృహ్ణన్నిందుక్ష్వేళావివేశ్వరః।
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి"
(శివుడు చందురు గరళము ననదరించు
పోల్కి బుధుడును గుణదోషముల గ్రహించు,
మొదటిదానిని శిరమున మోసి మరియు
దక్కుదానిని కుత్తుక నొక్కియడచు)
కావ్యగుణములను పరిశీలించుట విమర్శకుని మొదటి పని
"శ్లేషః ప్రసాదస్సమతా సమాధి
ర్మాధుర్యమోజః పదసౌకుమార్యమ్
అర్థస్య చ వ్యక్తిరుదారతా చ
కాంతిశ్చ కావ్యార్థగుణాదశైతే"

అని కావ్యగుణములను వివరించిరి కాని "మాధుర్యము ఓజస్సు ప్రసాదము" అనునవి మాత్రము రసాస్వాద హేతువులగు గుణములని నిశ్చయించిరి.

చిత్తమును కరుగనిచ్చి యానందపరవశము గావించు గుణవిశేషము మాధుర్యము. ఇయ్యది సంభోగశృంగార కరుణ, విప్రలంభ, శాంతరసములయందు క్రమముగ నతిశయించును. దీనికి

కఠినవర్ణవర్జితమైన విడివిడి పదముల రచనగాని కొద్దిపాటి సమాసములతోడి పదముల రచనగాని యనుకూలించును

చిత్తమును విస్తారముగా వికసింపచేయు గుణము ఓజస్సు ఇది వీర, బీభత్స రౌద్రరసములయందు క్రమముగా నతిశయించును దీనికి దీర్ఘసమాసములతోడి యుద్ధతరచన యనుకూలించును

ఎండుకట్టెల నిప్పు రగుల్కొనునట్లు త్వరగా చిత్తమునందు వ్యాప్తిచెందు గుణవిశేషము ప్రసాదము ఇది యన్ని రసములయం దతిశయించును. అన్నివిధములైన రచనలు దీని కనుకూలించును

అనంతరము విమర్శకుడు ప్రఖ్యాతోత్పాద్యమిశ్రములగు నితివృత్తముల కనుగొని కవి ప్రాచీనుడగుటయు నవీనుడగుటయు నెఱింగి, యతని దేశకాలములు పరిసరములు సాంఘికవృత్తి యతడు లోకమున కియ్యదలచిన సందేశము మున్నగునవి గుర్తించి, కావ్యనిర్మాణమున నతడు చూపిన చతురత జాతీయత సంస్కృతి పరిణామములు అవగాహన చేసికొని దోషైకదృక్కు కాక కావ్యమునందలి భావగాంభీర్యమును ప్రకరణాద్యౌచిత్యమును, రసపుష్టిని వివరించి కవి ప్రతిభాప్రతిష్ఠల కెల్ల లేర్పరుచువాడు గావలయును ప్రాంతాభిమానములకును సంఘాభిమానముల కును నెంతమాత్రము చోటిచ్చువాడు కాగూడదు

పరిశ్రమలేకయే దొరికిన వస్తువునకు మెఱుగుపెట్టి భద్రపరచుటవంటిదగు ప్రఖ్యాతేతివృత్తకకావ్యమునందు భావపుష్టి రచనాచమత్కృతి గమనించవలసిన యంశములు శ్రమపడి క్రొత్తవస్తువును సంపాదించి మెఱుగుపెట్టి భద్రపరచుటవంటిదగు కల్పితేతివృత్తకకావ్యమునందు కల్పనాచమత్కృతి రచనావైశిష్ట్యము, భావపుష్టి గమనించవలసియుండును మిశ్రకావ్యమునందు పై విషములతోపాటు ప్రకరణాద్యౌచిత్యమును గమనించవలయును

ఇంతకు తెలివదేమన కవియును లోకోత్తరపురుషుడు ఉత్తమపురుషార్థసాధకదృష్టిచే నవనవ భావ కుసుమోన్మేషవిలసితంబులగు క్రొంగ్రొత్త కావ్యోద్యానముల సృజియించి ప్రజాజీవితవిధానమునకు మార్గదర్శకుడై వారికి మానసిక విశ్రాంత్యానందసౌఖ్యముల చేకూర్చుచు నాచంద్రార్కము యశశ్చంద్రికల తేజరిల్లుచు చిరంజీవి యగుగాక

విమర్శకరసికు డా కావ్యోద్యానమున ప్రవేశించి యాహ్లాదజనకములగు గుణములను మనోజ్ఞకమార్గముల సంచరించుచు నందలి రీతులను తిలకించుచు లలితపదవాక్యవిస్ఫురణశారికాకీరకోకిలధ్వనుల కలరుచు భావాంకురవిలాసముల కుల్లసిలుచు చిత్రవిచిత్రాలంకారపద్ధతుల కచ్చెరువందుచు ఔచిత్యకుసుమవికాసముల కానందించుచు నవరసఫలాస్వాదమదోన్మత్తుడై కవి కావ్యప్రతిష్ఠా మధురగీతికను పాడుకొనుచు దీర్ఘాయువై వర్ధిల్లుగాక

—(o)—




(రివ్యూకై రెండు ప్రతులు పంపాలి)

## చిరుగజ్జెలు

ప్రచురణ తెలంగాణా రచయితల సంఘం సిరిసిల్ల వెల ఆరు అణాలు

మన తెలుగుదేశంలో బాలవాఙ్మయానికి ఎక్కువ ప్రచారం ఇటీవలనే కలిగింది పిల్లలకి పనికివచ్చే పత్రికలు ఈమధ్య కొన్ని వెలిసి చక్కగా సాగుతున్నాయి ఇందులో కొన్ని రాక్షసాకారం గల బొమ్మలను వికృతమైన రంగులతో ముఖచిత్రాలుగా ముద్రిస్తూ పిల్లలను కళాదృష్టిని తప్పుత్రోవలోకి దింపుతున్నారన్నలోపం తప్పితే ఈ పత్రికలు బాగానే ఉంటున్నాయి పిల్లలకోసము పిల్లలు పెద్దలూ రచించిన కథలు, నాటికలు ఇత్యాదులు ఈ పత్రికలలో చూస్తుంటాము కొన్ని చాలా బాగుంటున్నాయి

కొన్ని పిల్లలకోసమని వ్రాసినవి పుస్తకరూపంగా వెలువడిన రచనలు చాలా తక్కువ మంచి మంచి రచనలు ఇంకా ఎన్నైనా కావాలి తెలంగాణా రచయితల సంఘంవారు, కొందరు రచయితలు పిల్లలకోసం వ్రాసిన నాటికలు సేకరించి ఒక చిన్న పుస్తకంగా అచ్చువేసి ప్రచురించారు "చిరుగజ్జెలు" పేరుకు తగిన ముఖచిత్రంకూడా అందంగా ఉంది

నాటికలు పి. నారాయణ రెడ్డిగారు రచించిన "సమతాఫలం" దాశరథి రచించిన "వెన్నెల మడుగులు" వట్టికోట ఆళ్వారుస్వామి రచించిన "సావాసం", యశోదాదేవి రచించిన బుచ్చయ్య తెల్వి." వీటిలో దాశరథి రచించిన "వెన్నెల మడుగులు"లోనే బాలవాఙ్మయానికి కావలసిన లక్షణాలు చేకూరినవి కొంత కథాచమత్కృతి, కొంత అద్భుతరసము కొంత కరుణ మనలను ఎక్కువగా ఆకర్షిస్తాయి

యశోదాదేవిగారి రచన తెలంగాణా ప్రాంతీయ భాషను చదివి ఆనందించటానికి అవకాశమిస్తుంది కాని అంతకంటె ఎక్కువ విశేషములేదు నారాయణ రెడ్డిగారి పద్యనాటిక ఒక అంతరార్థంతో వ్రాసినది మొత్తంమీద. నడక చాలా బాగుంది కాని కొన్ని కొన్ని ప్రయోగాలు కటువుగా ఉంటాయి

"కమ్మ కమ్మ క్రౌంచాపుల
కుసుమమల్లె దువ్వేరా" అనేది
పిమ్మట పాటలతో తల
దిమ్మను పీదాలిరా" అనేది

ఇటువంటివి అట్టే బాగాలేవు అంతేగాక ఎంత అందమైన తోటైన మనదికాని ప్రదేశంలోకి మనం వెళ్ళకూడదని పిల్లలకు చెప్పడం బదులు ఇంకొకరితోటలోకి వెళ్ళి వారిని బలాత్కరించి అక్కడి ఆనందాన్ని అనుభవించడం పిల్లలకు నేర్పడం అట్టే అంత ఆదర్శకరం కాదేమో ! ఐనా ఇందు అభిప్రాయభేదానికై తావుంటుంది

మొత్తంమీద ఆలోచిస్తే దాశరథిగారి "వెన్నెల మడుగులు" నాటిక ఒక్కటే బాలవాఙ్మయానికి తగినదని చెప్పాలి

## త్యాగమూర్తి

రచన "కవిచంద్రులు" శ్రీ కోటసోదర కవులు, అష్టావధానులు ప్రతులకు కవిచంద్ర గ్రంథమాల కవిగిరి, నెల్లూరు జిల్లా లేక 28, నాటుపిళ్లారి కోవెల స్ట్రీట్, మద్రాసు 1 సైజు క్రౌన్ పుటలు 8+22 వెల ఎనిమిది అణాలు

ఆంధ్రరాష్ట్రసాధన మహాయజ్ఞమునకు నిరశనవ్రత సమిత విర్నిద్రదీక్షబూని ప్రధాన సమిధగా నాహుతియైనవారు శ్రీ పొట్టి శ్రీరాములుగారు. ఈ యమరజీవి యాశయసిద్ధి చేకూరినది. ముక్కోటి యాంధ్రుల ముచ్చటైన కోర్కె నేటికి ఫలించినది ఇట్టి శుభసమయమునం దాంధ్రప్రజ శ్రీరాములుగారి ప్రశస్తచారిత్రమును కీర్తించుటకనువుగా శ్రీ కోటసోదర కవులు "త్యాగమూర్తి" యను ఈ చిన్నిగ్రంథమును రచించిరి

ఈ గ్రంథమునందు శ్రీరాములుగారి చరిత్రము కరుణరసభరితమై చక్కగా నొప్పారుచున్నది ఆంధ్రుల యచంచల కార్యదీక్ష కల్పమునం దడుగడుగున వ్యక్తమగుచు శ్రీరాములుగారి త్యాగము కనులకు కట్టినదై యొప్పుచున్నది

ఈ కవిచంద్రుల కవితయం దన్యదేశ్యములు గూడ మాధుర్యము లొలికించు తెలుగు పలుకుబడులయందు కలసి క్రొత్త సొంపులు గైసేసికొన్నవి

ఇట్టి రసవద్గ్రంథ రచనమొనర్చి "త్యాగమూర్తి" త్యాగమును తెలిపిడి యొనర్చిన కవిచంద్రులు ధన్యులు

"నెల్లూరు రైల్వే" యిత్యాది పదములు వీరి కవితానిరంకుశతను తెల్పుచున్నవి "ఆస్తిపాస్తులు అన్తే" యిత్యాది తెలుగు జాతీయపు పలుకుబడులతో కవిత యలరారుచు పండిత పామరరంజకమై యొప్పుచున్నది. ఆంధ్రరాష్ట్రసిద్ధికై యసువుల నర్పించిన "త్యాగమూర్తి" యను ఈ చిన్నిగ్రంథ మెల్లరును పఠించి సంతసింతురుగాక

విద్వాన్ హనుమనగుత్తి రాధాకృష్ణయ్య
కిన్నెర

## శ్రీరామకృష్ణ ఉవాచ

రచయితలు: శ్రీ శ్రీరాం వేంకట భుజంగరాయశర్మ, శ్రీ కందుకూరు మల్లికార్జునంగార్లు ప్రచురణ శ్రీ రామకృష్ణ మఠము మైలాపూరు మద్రాసు 4 సైజు చిన్న సైజు పుటలు VII + 124 వెల ఆరు అణాలు

శ్రీ రామకృష్ణ పరమహంసుని ఉపదేశములలో నిరంతర పఠనీయాలగు కొన్ని సూక్తులకు ఈ పుస్తకం ఆంధ్రానువాదం ఏతత్పూర్వకాలకుంచే 1952 లో ఇంగ్లీషులో "Thus Spake Sri Ramakrishna" అనే పేరుతో ఒక గ్రంథం ప్రకటింపబడింది ఈ పుస్తకం ఆరు ఏడు నెలలలోనే ఎనిమిదివేల కాపీలకు పైగా విక్రయించబడ్డాయట ఈ ఆంగ్లగ్రంథానికే ఈ చిన్నిపుస్తకం అనువాదం

ఈ పుస్తకం జేబులో ఇమిడికగా పెట్టుకోడానికి అనువైన సైజులో ప్రకటింపబడింది జ్ఞానం భక్తి, కర్మయోగం, గురువు గృహస్థుడు మొదలైన శీర్షికలక్రింద ఈ సూక్తులు విభజింపబడినాయి పుస్తకం ప్రారంభంలో శ్రీ రామకృష్ణ పరమహంస జీవితం సంగ్రహంగా ఇవ్వారు ఆర్టుప్లేటుమీద ముద్రించిన రామకృష్ణుని పటం గ్లేజుకాగితంపై చక్కగా అచ్చువేసిన పుస్తకం ముద్దులమూటగట్టుతూ ఉన్నది

## గ్రంథస్వీకారం

1 తెలుగుసూక్తులు రచన శ్రీ పుట్టపర్తి శ్రీ దివాకర్ల ప్రచురణ తెలంగాణా రచయితల సంఘం, జనగామ(శాఖ) వెల ఒక రూపాయి నాలుగు అణాలు

2 పూలతోట రచన శ్రీ కవిరాజ కాంధూరు నరసింహాచార్యులు ప్రచురణ శ్రీ కె రంగరామానుజాచార్యులు C/o శ్రీ కె నరసింహాచార్యులు ఆంధ్ర పండితులు జమ్మలమడుగు వెల ఎనిమిది అణాలు

3 తెనుగు కవుల చరిత్ర (ప్రాచీన కాలమునుండి క్రీ శ 1250 వరకు) రచన శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఎమ్ ఏ అధ్యక్షులు—తెనుగు పరిశోధన శాఖ ప్రాచ్య పరిశోధన సంస్థ ప్రచురణ మదరాసు విశ్వవిద్యాలయము సైజు రాయల్ పుటలు XXVIII + 394 వెల పన్నెండు రూపాయలు

4 నా చిన్ననాటి ముచ్చట్లు రచన డాక్టర్ కే ఎస్ కేసరి ప్రచురణ గృహలక్ష్మి కార్యాలయము, రాయపేట మద్రాసు సైజు క్రౌను పుటలు VIII + 248 + VIII

5 మానవులు మహీధరముల రచన యం ఇలిన్ అనువాదం శ్రీ జగన్మోహన్ ప్రచురణ విశ్వసాహిత్యమాల రాజమండ్రి సైజు క్రౌన్ పుటలు XVI + 478 వెల అయిదు రూపాయలు

6 యక్షప్రశ్నలు (రెండో ముద్రణ) రచన శ్రీ మహీధర జగన్మోహన్ ప్రచురణ విశ్వసాహిత్యమాల సైజు క్రౌను పుటలు VI + 204 వెల రెండు రూపాయలు

7 రష్యా విప్లవం (1905) రచన వి ఐ లెనిన్ అనువాదం శ్రీ మహీధర జగన్మోహన్ ప్రచురణ విశ్వసాహిత్యమాల రాజమండ్రి సైజు క్రౌన్ పుటలు 122 వెల ఒక రూపాయి నాలుగు అణాలు

8 ప్రజల ప్రజాతంత్ర నియంతృత్వం రచన మావ్-త్సే-తుంగ్ అనువాదం శ్రీ మహీధర జగన్మోహనరావు ప్రచురణ విశ్వసాహిత్యమాల సైజు క్రౌను పుటలు 55 వెల ఎనిమిది అణాలు

9 జలపాతం రచన శ్రీ ఎ నారాయణ రెడ్డి ప్రచురణ అరుణశ్రీ గ్రంథమాల 1370/1 జనరల్ బజారు సికింద్రాబాదు సైజు క్రౌను పుటలు 83 వెల ఒక రూపాయి

10 వ్యాసాలు రచన ఐంస్ అనువాదం శ్రీ కాళహస్తి లక్ష్మణస్వామి ప్రచురణ కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ సంస్కృతాంధ్ర గ్రంథాలయం రాజమండ్రి సైజు డెమ్మి పుటలు 227 వెల రెండు రూపాయలు

11 పిల్లల కథలు రచన శ్రీ కాళహస్తి లక్ష్మణస్వామి ప్రచురణ కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ సంస్కృతాంధ్ర గ్రంథాలయం రాజమండ్రి సైజు క్రౌన్ పుటలు 99 వెల ఒక రూపాయి

12 శ్రద్ధాంజలి రచన శ్రీరామ వేంకటశేషారావు ప్రచురణ గ్రంథకర్త చిత్రాడ పిఠాపురం పోస్టు సైజు క్రౌను పుటలు 109 వెల ఒక రూపాయి

13 పద్మపురాణము (భూమి ఖండాంధ్ర వచనము) రచన శ్రీ మరువాడ శంభన్నశాస్త్రి ప్రచురణ సాధన గ్రంథ మండలి తెనాలి సైజు క్రౌను పుటలు 262 వెల రెండు రూపాయలు

14 రైతే చెప్పాలి (వ్యవసాయాభి వృద్ధినిగురించి పదిమంది అభిప్రాయాలు)

15 సామాజిక వికాస పథకము

పై రెండు పుస్తకాల ప్రచురణ ప్రభుత్వ సమాచార ప్రకటనశాఖ మద్రాసు

16 ఆంధ్రరాష్ట్రావతరణ సంచిక ప్రచురణ వేంకట్రామ అండ్ కో ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ విజయవాడ

17 ఆధునిక విజ్ఞానం (తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక) సంపాదకులు డాక్టర్ వై వి సోమయాజులు డి ఎస్ సి ఎ ఐ ఆర్ ఇ ప్రచురణ అప్లాండ్స్ వాల్తేరు సాలు చందా ఆరు రూపాయలు విడి ప్రతి ఎనిమిది అణాలు

18 మాతృసేవ (ఆంధ్ర రాష్ట్ర ప్రత్యేక సంచిక) సైజు క్రౌన్ పుటలు 120 వెల ఒక రూపాయి ఎనిమిది అణాలు

19 నవ్వుల రాణి (మాసపత్రిక) గౌరవ సంపాదకులు శ్రీ సూరి శెట్టి ప్రచురణ శ్రీ కె జగ్గారావు, 37 పీయాశీ ముదలి వీథి మద్రాసు 2 విడి ప్రతి వెల నాలుగు అణాలు

20 స్వతంత్ర భారత్ (రాజకీయ పక్షపత్రిక) ఎడిటర్ శ్రీ ఎ వి కృష్ణమూర్తి ప్రచురణ శ్రీ పి పాండురంగం 12 కుమరప్ప మేస్త్రి స్ట్రీట్, మద్రాసు 1 సాలు చందా : మూడు రూపాయలు విడి ప్రతి వెల రెండు అణాలు

21 భారత జ్యోతి (రాజకీయ వార పత్రిక) సంపాదకులు శ్రీ రామకృష్ణ, బి ఏ ప్రచురణ శ్రీ వి ఆర్ గోపాలకృష్ణ, భారత జ్యోతి ప్రింటింగ్ ప్రెస్ రైల్వే స్టేషన్ రోడ్డు కడప విడి ప్రతి వెల మూడు అణాలు

## ENGLISH

22 The Newzealand Vegetarian (త్రైమాసిక పత్రిక) సంపాదకులు మిసెస్ బి కన్నింగ్‌హాం ప్రచురణ ఆక్లాండు, న్యూజీలాండు సాలుచందా నాలుగున్నర షిల్లింగులు

23 Peace Review (పీస్ రివ్యూ) మాస పత్రిక సంపాదకులు శ్రీ ఎస్ కౌల్ ప్రచురణ 14 మున్షీ నికేతన్ కమలా మార్కెట్ న్యూఢిల్లీ సాలుచందా అయిదు రూపాయలు విడి కాపీ ఎనిమిది అణాలు

24 Red Brother or Yellow Slave? రచన శ్రీ సీతారాం గోయల్ సైజు డెమ్మి పుటలు 82 వెల ఆరు అణాలు

25 China is Red with Peasant's Blood రచన శ్రీ సీతారాం గోయల్ సైజు డెమ్మి పుటలు 92 వెల ఆరు అణాలు

పై రెండు పుస్తకాలు ప్రచురణ సొసైటీ ఫర్ డిఫెన్స్ ఆఫ్ ఫ్రీడం ఇన్ ఏషియా 12 చౌరింఘీ స్క్వేర్ కలకత్తా.

26 Asia (త్రైమాసిక పత్రిక) ఎడిటర్ రెని డి బెర్వల్ ప్రచురణ సైగాన్ (వియత్-నాం) సాలు చందా పన్నెండు రూపాయలు విడి ప్రతి మూడు రూపాయలున్నర

Printed by V Asizullah at the Deccan Times Press, 137 Broadway Madras, for the Deccan Printing & Publishing Co Ltd., Madras. Published by P Mira Bai at 16 Jones Street, Madras—1,
Editor: P MALLIKARJUNA RAO Assistant Editor: P MIRA BAI

